

సమర్పణ

స్నేహహస్తాలతో

డైరెక్టర్ టి. ప్రకాశరావుగారికి

# నా మాట

ఈ నాటకానికి మా పురప్రముఖుణ్ణో లేక ఆంధ్ర ప్రముఖుణ్ణో సమీపించి పరిచయవాక్యమన్నా, ఉపోద్ఘాతమన్నా వ్రాయమని అడిగాననుకోండి, ఆయన అంగీకరించి, నన్నూ నా రచననూ [తన్ను కలుపుకొని] పొగుడుతాడు. అటువంటి అభిప్రాయాలకు విలువలేదని ఆ పద్ధతి తొలగించాను.

నిజానికి తొలిపలుకు రాయాల్సినవారు ప్రజలు. వారి అభిప్రాయం అమూల్యం. కనుక ఈనాటకాన్ని ప్రజలచేతుల్లో పెడుతున్నాను.

రచయిత.

# ఈ నాటకంలో

| | | |
|---|---|---|
| కుటుంబరావు | గృహస్థు | వయస్సు 55 |
| ప్రకాశం | కుటుంబరావు పెద్దకొడుకు | ,, 25 |
| రాము | కుటుంబరావు చిన్నకొడుకు | ,, 16 |
| భాస్కరం | సంగీత మాష్టరు | ,, 25 |
| రంగనాథం | కుటుంబరావు మేనల్లుడు | ,, 25 |
| రామయ్య | రంగనాథం తండ్రి | ,, 50 |
| సుబ్బయ్య | షావుకారు | ,, 56 |
| కొండడు | ఒక త్రాగుబోతు | ,, 35 |
| డాక్టరు | కుటుంబరావు హోమ్‌డాక్టరు | ,, 50 |
| షణ్ముగం | కారుడ్రైవరు | ,, 30 |
| యిన్‌స్పెక్టరు | | ,, 35 |
| శాంత | కుటుంబరావు కుమార్తె | ,, 18 |
| లచ్చి | పనిమనిషి | ,, 20 |

ఇద్దరు పోలీసులు

# వాగ్దానం

## 1వ రంగం

### సమయం;— సాయంత్రం 5 గంటలు

కుటుంబ రావు భవనంలో వరండా, దేశనాయకుల ఫోటోలతో పాటు కుటుంబరావుభార్య ఫోటోకూడా గోడకు తగిలించివుంటాయి.

కుర్చీలను, టేబులును సర్దుతూ లచ్చి పూడుస్తూ వుంటుంది. రంగనాథం ట్రంకుపెట్టెతో ప్రవేశం)

రంగః— మామయ్యా! ఓ మామయ్యా!

(లచ్చి రంగనాథం వైఖరి క్రిందనుంచి పైకి వక్కసారిగా చూస్తూంది. రంగనాథం ఆశ్చర్యంగా లచ్చివంక చూస్తాడు. లచ్చి నవ్వుకుంటూ ముఖం ప్రక్కకు త్రిప్పుకుంటుంది.)

రంగః— ఓ పిల్లా! ఎవరు నువ్వు?

లచ్చిః— ... ...

రంగః— అయ్యో! పలకవేంటి రబ్బరు బొమ్మలాగ!

లచ్చిః— ... ... (నవ్వుకుంటుంది)

రంగః— ఓహో! నువ్వా! మామామనుష్య కూతురువికదూ? అవునవును. మరి చెప్పవేం?

లచ్చిః— (గట్టిగా నవ్వుతుంది)

రంగః— బాగుంది. బాగుంది చాలాబాగుంది పెళ్ళికొడుకును వచ్చానుకదా సిగ్గు లేదేమిటి? శాంతీ! ఓ శాంతీ! అయ్యో నా శాంతి! ... ఎంత పెద్దదానవయ్యేవే? యింత చిక్కిపోయావేం?

లచ్చిః— (మరీ గట్టిగా నవ్వుతుంది)

రంగ:- చిక్కిపోలేదూ! ... అవునవును ... చిన్నప్పుడు చూశాలే, మరి ... మరి ... మామగారేరి?

లచ్చి:- మామగా రేంటి...బాబుగారా...బాబుగారు షికారుకి పోయినారు.

రంగ:- యిది మరీ బాగుంది, ఏందా భాష వడి) దానికిమల్లె (వెటకారంగా) పోయినారూ. వెళ్లినారు వుండినారు.

లచ్చి:- ఏంయ్?

రంగ:- అవునవును మీాకామాట అలవాటేకదూ!

లచ్చి:- అలవాటులేదు గిలవాటులేదు. ఎవరునువ్వు అబ్బాయి మాదీమాగా మాట్లాడేత్తున్నావ్

రంగ:- అయిందీ...నేను...నేనే...నీకు తెలీదేంటి, అవునవును క్రొత్తకదూ పాపం...చెప్పనా...అయినా నీకు చెప్పటం ఏంటి మగవాడినైవుండి ... నీక్కనపట్టంలా యీా యింటికి అల్లుడ్ని

లచ్చి:- అవునవును (వేళాకోళంగా) యింటికి అల్లుడిలాగే వున్నావు దేబెమొగం నువ్వునూ. ఎవరిల్లనికొని వచ్చావ్. పో పో. మా శాంతమ్మగారికి దొరగ్గా దొరగ్గా యిలాంటి ముచ్చు మొగమే దొరకాలి

రంగ:- అయిందీ!...అది సరేకానీ యింతకూ నువ్వెవరవూ?
(తెరలో రిక్షావాడి కేకలు)

రిక్షా:- ఏటిబాపు సిల్లరిసేదని నోపలికొచ్చారు, జాముసేపయింది

రంగ:- వుండరా వెధవగోల పానకంలోపుటకలాగ

రిక్షా:- [తెరలో] ఏటండే ఎదవగోలంటారు డబ్బునపంపించండే

రంగ:- ఒరే! రిక్షాఅక్కడేవుంచి రూపాయి మార్చుకురారా?
[రూపాయియిస్తాడు, లచ్చితో] ఎవరునువ్వు?

లచ్చి:-యీాయింటికి నేను లచ్చిని
రంగ:- ఒస్ నువ్వాటేలచ్చి! నువ్వు యీాయింటిదాసిదానివిట్రే!
మాఅయ్య చెప్పాడులే నువ్వుచాలామంచిదానివని
లచ్చి:- ఆట్టాగా! అవునవును, కూచోండిబాబుగారు
రంగ:- బాగుందివరస, నాఅలవాట్లు నీకూఅబ్బాయ్? చూడు లచ్చీ! నువ్వుచూస్తుంటే బొత్తిగామంచిపిల్లలా కనబడుతున్నావు. నిన్నుచూస్తుంటే...ఏంటో...అదోలాగ..
లచ్చి:- ఏంటది?
రంగ:- యిప్పుడెందుకులే బాబుగారొస్తారు ... బాబుగారేంటి కాదుకాదు మా మామయ్యగారొస్తారు
లచ్చి:- ఊ! నా అలుసుకనుక్కున్నావే?
రంగ:- చిన్నవలుసులా నా అలుసుకనుక్కోలేదా ఏం? [మూతి బుంగమూతిలా పెడతాడు లచ్చినవ్వుతుంది అదిచూచి రంగనాథం నవ్వుతాడు. చేతిలో పుస్తకంతో శాంత వస్తుంది]
శాంత:- (కోపంగా) లచ్చి ఏమిటే అ నవ్వులూ? ఈయ నెవరే?
లచ్చి:- అల్లుడు.
శాంత:- ఎవరల్లుడు?
లచ్చి:- యింకెవరల్లుడు! (నవ్వుతుంది.)
శాంత:- ఏమిటా నవ్వు!
లచ్చి:- బాబుగారి అల్లుడు (బిగ్గరగా నవ్వుతుంది)
శాంత:- (ఆశ్చర్యంతో) ఆఁ!
రంగ:- ఆఁ! ఆఁ!...అవునవును...ఎవరు మీారు?
శాంత:-ఓ హో! ... మీారేనా...రంగ...
రంగ:-అవునవును, నేనే పూలరంగణ్ని.

శాంత:- వృత్తరంగారా వ్రియునుండా వచ్చారేం?

రంగ:- మా అయ్యవ పిచ్చాడు పిల్లనిచూచి నమ్మని, అందుకని తప్పించుకుని వచ్చాను అంతే. యింకెందుకూ ఆలశ్యం. ఆలశ్యం అమృతం విషంఅన్నారు (తెరలో రిక్షావాడు చిల్లరిదిగో బాబుఅనిఅంటాడు రంగడు చిల్లరతీసుకొని మూడణాలు మాత్రమేయిస్తాడు.)

రిక్షా:- ఏటిబాబు దర్మం యిత్తన్నారా?

రంగ:- పో పో!

రిక్షా:- టేషనుకాడనుంచి యిక్కడికి ఆరణాలు యిత్తానన బాబ్ యిస్ అందరికీ ఎరికే

రంగ:- ఎరికినేను పిరికినేను పోపో!... (శాంతతో) చూడండీ!

రిక్షా:- మాసొగ్గ ఎక్కేసినావ్ బేరమాడకుండాను. యిలాటోల్లని శానామందిని సూసినాను.

రంగ:- ఏమ్మిటో గాడిదా!

రిక్షా:- ఆఁ ఆఁ గాడిదినాగావున్నాను. వల్లక మాటలిసిరేక మరి మూడణాలు పడేయ్యి నావాణ్ని పోతాను.

రంగ:- నువ్వు అరిచిచచ్చినా దమ్మిడీ యివ్వను. ఎవరినను కున్నావో, ఏమిటనుకున్నావో

శాంత:- వెళ్ళవోయ్ (పర్సులోనుంచి మూడణాలుతీసి రిక్షావాడి కిస్తుంది రంగనాధంతో) కూర్చోండి పాపం చాలా శ్రమ పడ్డారు. యిప్పుడే కాఫీ పంపిస్తాను. (లోపలికి పోతుంది.)

రంగ:- (కుర్చీలో కూర్చొని) అదృష్టమంటే యిదే అల్లుడి బ్రతుకు... (వెళ్ళబోయెలచ్చిని ఆపి) చూడు లచ్చీ, మనలో మనమాట యిప్పుడొచ్చిన అమ్మాయిఎవరు?

లచ్చి:- (నవ్వుతూ) యింకా తెలియలా? శాంతమ్మగారు!
రంగ:- (ఆశ్చర్యముతో) ఆఁ శాంత! ఏంటి? నా శాంత?
అంటె పెళ్ళికూతురు? (అని కుర్చీలో కూలబడతాడు)
(లచ్చి గ్లాసుతో నీళ్ళు తెచ్చి ముఖానకొట్టి విసనకర్రతో విసరుతుంది రంగడు తాస్త తేరుకుంటాడు.)
రంగ:- లచ్చీ! ...పాపం... ఎంత శ్రమిచ్చానే, నీఋణం ఏలా తీర్చుకుంటానే?
లచ్చి:- మరేం పరవాలేదు. గాబరా పడకండి
రంగ:- (కోపంగా) గాబరాఏంటి నీ మొగం (తన్మయత్వంతో) చిన్నదాన్ని చూచి, చిన్నవాడు మూర్ఛపోయాడు అంతే. ఆ మాత్రం తెలుసుకో లేకపోయావు.
(అదోరకంగాచూచి. చెంగులాగుతాడు)
లచ్చి:- (తీవ్రంగా) ఛీ! ఏమిటది. (చెంగు విదిపించుకుంటుంది)
రంగ:- అవునవును మూర్ఛలో వున్నానుకదూ ... అమ్మయ్య యిప్పుడిప్పుడే తేరుకుంటున్నా
లచ్చి:- (లచ్చి లోపలికి పోతుంది)
(రంగడు లచ్చిపోయినవేపే చూస్తుంటాడు. కుటుంబరావు ప్రవేశం వీధిలోనుంచి దగ్గుతూ)
రంగ:- ఎవరువారు? (అని అకస్మాత్తుగా తిరుగుతాడు. చూచి ఆనందంతో) ఆఁ..మామయ్యా (అని పెద్దగా అరుస్తాడు) మామయ్యా మామామయ్యో (అని కౌగలించుకుంటాడు)
కుటుం:-ఏరా రంగా! ఎప్పుడూరావడం?
రంగ:- యింతకుముందే మామయ్యా! యిప్పుడిప్పుడే
కుటుం:-మీనాన్న కులాసాగా వున్నాడా?

రంగ:– ఓం కళలాసాగేవున్నాడు. యీ మధ్య నాకే చాలా పెళ్ళి సంబంధాలు వచ్చాయి మామయ్యా. వకళ్ళేయిల్లరికం వచ్చేయ్యమని బలవంతం చేసారు. మామయ్యా మా అయ్యావాళ్ళకేంచెప్పాడో తెలుసా? మా కుటుంబరావు బావగార్కి వాగ్దానంయిచ్చాను చిన్నప్పుడే, పెళ్లి గూడా త్వరలో జరుగుతుందని ఖచ్చితంగా చెప్పేశాడు. మామయ్యోయ్ వచ్చినోళ్లుకుండ పెంకుల్లాగ మొఖాలు పెట్టుకొనివచ్చినదోవే పట్టారు. (అని బిగ్గరగా నవ్వుతాడు తరువాత నెమ్మదిగా) యీ మాటలన్నీ గోడ చాటుగావుండి విన్నానులే మామయ్యా!

కుటుం:–[నవ్వుతూ] గొప్పపని చేశావురా!

(భాస్కరం వచ్చి వేసిస్తాడు.)

భాస్క:-నమస్కారమండీ [కుటుంబరావుకి]

కుటుం: నమస్కారం. రా భాస్కరం యిలా కూర్చో. యీమధ్య మీకు రేడియోప్రోగ్రాం వుందన్నారుకదూ

భాస్క:-(కూర్చొని) అవునండీ! అయిదో తారీఖున. అమ్మాయికి గూడా మీరు ప్రయత్నిస్తే...

కుటుం:–ఆం ఎందుకులెండి యీ సంవత్సరమే పెళ్లి చెయ్యాలను కుంటున్నాను.

రంగ:– చెయ్యాలను కోవడమేమిటిమామయ్యా! చేసెయ్యాలి కాని

కుటుం:–పెళ్ళంటే మాట్లనుకున్నావటోయ్?

రంగ:– అంత కష్టమా మామయ్యా? తెలీక అడుగుతున్నాలే కోప్పడకు మామయ్యా!

భాస్క:–ఎవరండీవీరు?

కుటుం:- మరిచాను. వీడు నా మేనల్లుడు రంగనాథం యింతకు ముందే వచ్చాడు

భాస్క:- ఓహో! అలాగా (రంగనితో) నమస్కారమండీ!

రంగ:- (చోకాస్కసర్దుకొని) నమ-స్కా--రం (లచ్చివస్తుంది.)

లచ్చి:- మాస్టరుగారూ మీరు రావచ్చు! (లచ్చి, భాస్కరం లోపలికి వెళతారు)

రంగ:- యీయనెవరు మామయ్యా? (మనకేమన్నా బంధువా?

కుటుం: కాదు సంగీతం మాస్టరు. చాలా మంచివాడు అమ్మాయికి హార్మోనియం నేర్పుతున్నాడు.

రంగ:- ఏంటీ! శాంత హార్మోనియం కూడా వాయిస్తుందా? అయితే చాలా బావుంటుంది మామయ్యా! అన్నట్టు జ్ఞాపకంవచ్చింది అసలు శాంతను గుర్తించలేకపోయాను

కుటుం:- మీ అమ్మ చనిపోయినప్పుడు మీ వూరువచ్చాం. శాంతకు అప్పుడు అరేళ్లు. తరువాత నీవెప్పుడూచూడ లేదు. ఆడపిల్లలు ఎంతలో ఎదుగుతారు?

రంగ:- (అమ్మ జ్ఞాపకం వచ్చి) అమ్మ ... అమ్మోయ్... (అని బోరున ఏడుస్తాడు).

కుటుం:- పూర్కో నాయనా ఏం చేస్తాం?

రంగ:- అంతె మామయ్యా! జ్ఞాపకం వచ్చిందిగనక ఏడ్చాను లేకపోతే ఎందుకేడుస్తాను. (కళ్ళనీళ్లు తుడుచుకుంటాడు

కుటుం:- రంగా! (దగ్గుతూ) నిన్నటినుంచి దగ్గుగావుంది డాక్టరు దగ్గరకివెళ్లొస్తా. యింతలోనువ్వు స్నానంచెయ్యి లచ్చీ

లచ్చి:- (లోపలినుంచి) ఆc.

కుటుం:- అబ్బాయికి ఏం కావాలోచూడు.

లచ్చి:- (లోపలినుంచి) అలాగే లెండి.

కుటుం:- వస్తానురా
రంగ:- సరే మామయ్యా! (కుటుంబరావు బయటకు వెళ్ళ్తాడు. రంగడు చొక్కా విప్పుతాడు. యింతలో లోపలినుంచి సంగీతం వినబడుతుంది భాస్కరం పాఠం చెబుతుంటే శాంత అంటుంది.

—♦ పాట ♦—

కోయిలా! పాడవే!
కోయిలా, పాడవే, తీయనిరాగము ||కో||
మనోవాంఛలు తీరేవరకు
మధురామృతమును గ్రోలేవరకు ||కో||

(రంగడు కూడా పాటకు తాళం వేస్తుంటాడు పాటఅయి పోయినా తాళం వేస్తూనేవుంటాడు లచ్చి వచ్చి చూచి)
లచ్చి:- పాట అయిపోయినా చేతులు తాళం యేస్తున్నాయి. ఆపి స్నానానికి లెగండి. (అని తుండుగుడ్డ చేతికిస్తుంది. రంగడు తీసుకొని లచ్చితో బాటు లోపలికి వెళతాడు. శాంత భాస్కరం వస్తారు)
శాంత:- ఏమిటండీ! యీ కొత్తపాట చాలా కష్టంగావుంది.
భాస్క:-నిన్న నేగా మొదలుపెట్టింది. సాధనలో సాఫీగావస్తుంది (అంటూ కూర్చుంటారు.) శాంతా! మీనాన్నగారు నీకు యీసంవత్సరమే పెళ్లి చేస్తారటగా!
శాంత:- నాతో ఆవిషయం గురించి మాట్లాడలేదే?
భాస్క:- యింతకుముందు మాటల్లో వచ్చిందిలే
భాస్క:-నీ హృదయంలో ఏముందో యిప్పటికివరకు మీనాన్న గారికి తెలియదు.

శాంత:- తెలీకపోవచ్చు! కానీ నా స్వాతంత్ర్యానికి అడ్డుతగలరు.

భాస్క:-(కాస్త ఆలోచించి) శాంతా! యివాళ్ళ మీయింటి కొచ్చిన బంధు వెవరూ!

శాంత:- మా మేనత్త కుమారుడట. ఆమె చనిపోయినప్పుడు, యీతనికి నన్నిచ్చి వివాహం చేస్తానని నాన్నగారు వాగ్దానం చేశారట.

భాస్క:-అయితే విషమసమస్యే! (ఆలోచించి) మీనాన్నగారు మాట తప్పేవారు కారు. చేసిన వాగ్దానాన్ని చెల్లించుకోవటానికే ప్రయత్నిస్తారు.

శాంత:-అంటే మీ వుద్దేశ్యం?

భాస్క:-అతనికిచ్చి ...

శాంత:-పెండ్లి చేస్తారనేనా, అలా ఎన్నటికీ జరగదు. ఎప్పుడో వాగ్దానంచేశారు. అందుకని యిప్పుడు యీ వెర్రి వాడికిచ్చి కన్నకూతురు కాపురంకూల్చే కఠినుడు కాడు మా నాన్న.

భాస్క:-పోనీ అలాగే అనుకుందాం, అతను ఆస్తిపరుడేమో?

శాంత:-ఆస్థిపరుడే, కావలసినంతవుంది. వుంటే?

భాస్క:-అటువంటప్పుడు ఆస్థి వున్నవాడ్ని విడిచిపెట్టి కేవలం సంగీత పాఠాలతో పొట్ట పోసుకొనే నిర్భాగ్యుడికి ఎవరైనా పిల్లనిస్తారా! ఏ తండ్రైనా చూస్తూ చూస్తూ తనపిల్ల గొంతుకోస్తాడా!

శాంత:-భాస్కర్! నన్ను బాధిస్తున్నావ్.

భాస్క:-లేదు, బాధ పడుతున్నాను శాంతా! డబ్బు ప్రధానమైన యీ లోకంలో ప్రేమకు స్థానంలేదు. అంతవరకెందుకూ నా విషయంచూడు. నా చిన్నతనంలోనే

తల్లీ, తండ్రీ పోయారు. వున్న ఆస్తిని చూచి పెద్దగా ఆదరించే వ్యక్తిగా నా మేనమామ నా రక్షణభారం వహించాడు. నాకు ప్రపంచ జ్ఞానం వచ్చేటప్పటికి నా చదువు సంధ్యల ఖర్చులకు నా ఆస్తంతా సరిపోయిందని లెక్కలుగట్టి బయటకు సాగనంపాడు అప్పుడు పడ్డా బాధ యింతా అంతా కాదు. తిండికోసం ఎన్నో అవస్థలు పడ్డాను. యిక ఏ ఆశాలేక మృత్యువును ఆహ్వానిస్తూ మిలటరీలో చేరాను. అప్పట్లో కవిత్వంలో శాస్త్రప్రవేశంవుంది చిన్న చిన్న భావగీతాలు వ్రాసి పాడుతుండేవాడిని. తరువాత యుద్ధంఅయిపోయింది యథాప్రకారంగాజీవితాన్ని సాగించవలసి వచ్చింది, ఉద్యోగం కోసం నేను తిరగనిఆఫీసంటూ లేదు. యుద్ధంలో చచ్చినా యీ బాధలు వుండేవి కావు. ఒకరాత్రి నిద్రపట్టలేదు. తీవ్రంగా ఆలోచించగా సంగీతతో పొట్ట పోసుకుందామనే ఆలోచన తట్టింది. మరుసటిరోజునుంచి సంగీత మాస్టరుగా తయారయాను. నా విద్వత్తు, వినయాన్ని చూచి చాలామంది ఆదరించారు. ఏదో మర్యాదగా బ్రతకడానికి యీ సంపాదన సరిపోతుంది యిటువంటి వాణ్ని పొంది ఏం సుఖపడతావ్ శాంతా?

శాంతః–భాస్కర్! యిన్నాళ్ళూ నిన్ను గురించి తెలియని విషయాలెన్నో యివాళ తెలుసుకున్నాను. మన యీ ప్రేమ పూరితమైన వివాహం ధనిక బీద అనేభేదంలేనిఆదర్శ వివాహంగా మారడం నా అదృష్టమని చెప్పాలి

భాస్క:–ఆదర్శమే! అయినా అష్టకష్టాలు పడాల్సి వస్తుందేమో.

శాంతః–కష్టాలొస్తాయని మన ఆశయాల్ని నాశనం చేసు

కుంటామా? అసలు మానవ జీవితమే విశేష భూ
యిష్టంగావున్నప్పుడు —— ——

భాస్క:-(అడ్డుతగిలి) అదికాదు శాంతా! మన కులాలు వేరు. కులరీత్యా చూచినా మన వివాహానికి అంగీకరించరు. ఒకవేళ మీ నాన్న అంగీకరించినా, కులమత ఆచారాలతో కరుడుగట్టిన యీ సనాతన సంఘం సుతరామూ అంగీకరించదు.

శాంత:-(ఈర్ష్యగా) ఊఁ. సంఘం, యీ సంఘం గుడ్డిది భాస్కర్. సంఘ నియమాలనుపాటించి వాళ్ళుచూపిన ఏ కురూపినో, దుర్మార్గుణ్ణో పెండ్లిచేసుకొని ప్రేమలేని ఆదాంపత్యంపడే అగచాట్లనుచూచి వెక్కిరిస్తుందీ సంఘం. అది అనుకూల దాంపత్యంకాదని వేరొకరిని ప్రేమిస్తే కులట, వ్యభిచారిఅని కోడై కూస్తుందదే సంఘం. ముసలి ముద్దయిన మగవాళ్లు ఎన్ని పెళ్లిళ్లు చేసుకున్నా మిన్నకుండే యీ సంఘం బాల వితంతువులకు మరోపెండ్లంటే మండిపడి వాళ్ల జీవితాలనుసర్వనాశనం చేస్తుందదే సంఘం, ప్రేమే దైవమని పెద్ద పెద్ద కబుర్లు చెప్పే యీ సనాతన ఛాందస సంఘం, హృదయపూర్వకంగా ప్రేమించి పెళ్లి చేసుకునే ప్రేమికులను కులం, మతం, ఆచారాలు అనే కుంటిసాకుతో విడదీసి వాళ్ల భావిజీవితాలను భగ్నం చేస్తుందీ పాడుసంఘం, యీ సంఘానికేనా మనం తలవంచాల్సింది? యీ సంఘానికేనా మనం భయపడాల్సింది? మాట్లాడరేం?

భాస్క:-[నిట్టూరుస్తూ] ఊఁ...

శాంత:- భాస్కరం! మీరు ఆరోజున లైబ్రరీలో ఉపన్యసించిన వాఖ్యాలు ఒక్కసారి గుర్తుకు తెచ్చుకోండి. ఆనాటి మీఉపన్యాసంవల్లనే నేనుపూర్తిగా మారాను. అందుకు మిమ్మల్నే ఒక ఆయుధంగా ఎన్నుకున్నాను. నా హృదయ కమలాన్ని మీ కంకితం చేశాను. దాన్ని హృదయసీమలో అలంకరిస్తారో కాళ్లతో రాచేస్తారో మీరే నిర్ణయించుకోండి.

భాస్క:- శాంతా! యిది సాధ్యమా, అసాధ్యమా అనేదీ ఆలోచించకుండా...

శాంత:- భాస్కర్! నీవేమీ చెప్పక్కరలేదు మానవుడు సాధించలేని విషయమంటూ ప్రపంచములో ఏదిలేదు. ఆఖరికి నానిర్ణయాన్ని చెప్పతున్నానువిను. నేను వివాహం అంటూ చేసుకుంటే మిమ్మల్ని తప్పమరొకరిని చేసుకోను. యిందుకుమీరు అంగీకరించకపోతే మరణ...

భాస్క:- శాంతా! నీ నిర్మలమైన ప్రేమను అర్థం చేసుకోలేకపోయాను. అందుకు క్షమించు.

శాంత:- మాస్టరుగారూ! (అంటూ అర్ధనిమీలిత నేత్రముఃతో)

భాస్క:- (దగ్గరగావచ్చి చేతులుపట్టుకొని) శాంతా! అంధకారంలో ఆశాకిరణ. లాగ నా నిరాశాజీవితానికి ఒక దివ్యజ్యోతిగా దారి చూపిస్తున్నావు.

రంగ:- (ప్రవేశం, కోపంగా) శాంతా! పరాయి మగాళ్లతో అంత దగ్గరగా...

శాంత:- ఓ... తమరా! స్నానంచేసి వచ్చినట్లున్నారే

రంగ:- అవునవును

భాస్క:-(భుజాలు ఎగరవేస్తూ) వస్తా శాంతా (నవ్వుతూ వెళతాడు)

రంగ:- వెళ్లేవాడు తిన్నగా వెళ్లక అదేమిటి ? నవ్వడమెందుకూ అంట

శాంత:- మనల్ని చూచి !

రంగ:- నిజంగానా ? ఏంటీ మన యిద్దరినిచూచి? అవును చిలకా గోరింకల్లావున్నాం కదూ!

శాంత:- ఆఁ అందుకే నవ్వివుంటాడు. కాబోయే భార్యనని [శాంతవెళ్తుంది]

రంగు:- (సంతోషంతో) యింతకుముందే తెలుసన్నమాట (తనచేతిని ముద్దుపెట్టుకొని విరహాంగా) ఆహా హా, ఎంత బాగుందీ! (హుషారుగా) లచ్చీ, ఓలచ్చీ లద్ద ?? తీసుకురా. మనం షికారు వెళ్లాలి ఫూరుమీాద.

లచ్చి:- (తె. లోనుంచి) తెస్తున్నా !

రంగ:- (చొక్కా వేసుకుంటాడు. చేతిలో పుస్తకాలతో రాము వస్తాడు.)

రాము:- హల్లో బ్రదరిన్‌లా గుడీవినింగ్.

రంగ:- (ఆశ్చర్యంగా)

రాము:- బావమర్దినోయ్, బావమర్దిని,

రంగ:- అరే... అరే—ఒరే రామూ ఎంత పెద్దవాడవయ్యావురా.

రాము:- ఆఁ ఏమనుకున్నావ్ ! నాన్నగారు నువ్వొచ్చావని చెప్పారు. మర్యాద చెయ్యటానికి పరుగెత్తుకుంటూ వచ్చాను.

రంగ:- అలాగా !

రాము:- మరి కాఫీ త్రాగవా?
రంగ:- ఆఁ కాఫీ గీఫీ అన్నీ తాగేశాను.
రాము:- మంచిపని చేశావ్ బావా
రంగ:- ఏం బావమర్ది!
రాము:- దశరా బుల్లోడుకుమల్లే తయ్యారయ్యావు ఎక్కడికి?
రంగ:- వూరుమీాద షికారుకి.
రాము:-ఛా! షికారు ఏమిటి నాన్ సెన్సు సినిమాకి పోదాంపదా!
రంగ:- సినిమాకా! అయితే మాయలమారికే వెళదాం
రాము:- మాయలమారా, మంత్రాలమారా నీలాంటి వెు ఖాలు చూడాల్సిందె.
రంగ:- ఏరోయి వేలెడు లేవుకానీ తాటాకులు కడుతున్నావే!
రాము:- అది కాదుబావా నిర్దోషి చాలాబాగుందట దానికే పోదాం.
రంగ:- సరే నీయిష్టం (అయిష్టతతో)
రాము:- అయితె రెండునిమిషాల్లో టాయులెట్టైవస్తాను (వెళ్లి పోతాడు)
రంగ:- ట్రాయిలెట్టేమిట్రా! ట్రాయిలెట్.
రాము:- యింగ్లీషు రాదేమిటి?
రంగ:- నాకు రాకపోవడమేమిటి ఎ. బి. సి డీ. ఎఫ్ అన్నీ చదివేస్తాను,
రాము:- ఏడ్చినట్లేవుంది ఎంతవరకు చదివావు!
రంగ:-అయిదోక్లాసు వరకు చదివేసాను.
రాము:- యింతేనా! నాకంటె తక్కువేనన్నమాట. మనం ఘోర్తుఫారం తెలిసిందా? టాయిలెట్టంటె మంచుకడు క్కొని ముస్తాబయి వస్తానన్నమాట.

రంగ:- ఒస్సి! యింతేనా యీ మాట్లన్నీ యిదివరకే తెలుసు మనకు. పోయి తొందరగా రా,

రాము:- దట్సుగూడ్! (అని లోపలికిపోతాడు)

(లచ్చి అద్దం దువ్వెన తీసుకొని టేబులుమీద పెట్టి వెళ్లబోతుంది)

రంగ:- ఏలచ్చీ వెళ్లిపోతున్నావె,

లచ్చి:- వుండండీ అవతల పనుందీ.

రంగ:- ఆపనేచెప్తాను యిటురా.

లచ్చి:- (ఆగి) అయితేచెప్పండి.

రంగ:- (లచ్చిదగ్గరగా వెళ్లి, అద్దం చేతిలోపెట్టి) యిలాపట్టుకో! (అని దువ్వుకుంటుంటాడు)

లచ్చి:- (నీరసగా) సరిపోయింది.

రంగ:- ఎహై కాస్త దించు.

లచ్చి:- ఆఁ (అని దించుతుంది)

రంగ:- యింకొంచెం

లచ్చి:- ఏమిటీ ఎదవగోలా (అని విసుగుతో అద్దం టేబులు మీద పెట్టి పోబోతుంది.)

రంగ:- (లచ్చి చెయ్యిపట్టుకొని) లచ్చీ ఎందుకే అంతకోపం! నిన్నుగూడా సినిమాకి తీసుకువెళతాగా!

లచ్చి:- ఛీ! చెయ్యివదులు (కోపంగాఅంటుంది)

రంగ:- కోపంవచ్చిందా (అని దగ్గరగా లాగతాబోడు)

లచ్చి:- వదలుతావా అమ్మగారిని పిలవమంటావా? (పెనుగు లాడుతుంది.)

రంగ:- (అటూ యిటూచూచి) నాబంగారులచ్చి (అనిముద్దు పెట్టుకో బోతాడు)

రాము:- (వాకిలి పెట్టుకుంటూ ప్రవేశం) బావా ?
రంగ:- (రాముని చూచి లప్పచెయ్యి వదిలేస్తాడు లచ్చిలోపలికి పోతుంది)
రాము:- ఏమిటి బావా రొమేన్సు జరిపేస్తున్నావు?
రంగ:- (తత్తరపాటుగా) ఆబ్బే ఏంలేదు కంటిలో నలుసుపడితే ఊదుతుంది. అంతే
రాము:- నాకే మస్కా కొడుతున్నావే? యిలావుందా నీపని ఉండు అక్కాయ్, అక్కాయ్!
రంగ:- రామూ రామూ, చెప్పకరా రామూ మీఅక్కయ్య కొట్టవంవస్తుంది. నీ క్కావాలంటే బేడయిస్తాగా! యిది గోతీసుకో (జేబులో చెయ్యిపోనిస్తాడు)
రాము:- ఛీ! బేడెందుకూ దండగ మనకు ఒన్ రుపీ కావాలి అంటే ఒక రూపాయి
రంగ.- రూపాయే !
రాము:- అంత ఏడిస్తే వద్దులే, అక్కా ....
రంగ:- (రాము నోరుమూసి) వద్దులే వద్దు - (జేబులో రూపాయితీసి) యిదిగో రూపాయి తీసుకో (చేతిలోపెడతాడు) మరి చెప్పవుగా.
రాము:- అప్పుడప్పుడూ మనకు డబ్బుతో అవసరా లుంటాయి. అప్పుడు (డబ్బులూ అన్నట్టూ చేత్తో సైగ చేస్తాడు) యిస్తావా?
రంగ:- (ఆతురతగా) అలాగైతే ముందు సినిమాకి పోదాంపద.
రాము:- దట్సుగూడ్! బావగాడంటే అలావుండాలి.
రంగ:- (నవ్వి) అంతేపదా! (అని రామునిలాక్కుపోతాడు రంగడు.) (తెరపడును)

# వాగ్దానం

## 2వ. రంగం

[అదే యిల్లు. అదే వరండా. రంగాలంకారం మొదటి సీను లాగానే వుంటుంది. కుటుంబరావు కుర్చీలో కూర్చొని టెలిగ్రాం చదువుతుంటాడు.]

కుటుం:-అమ్మాయ్. శాంతా!

శాంత:-[లోపలినుంచి] వస్తున్నా నాన్న [అని వస్తుంది] ఏం నాన్న పిలిచారు.

కుటుం;-అన్నయ్య దగ్గరనుంచి టెలిగ్రాం వచ్చిందమ్మా!

శాంత:-ఏమని వచ్చిందీ? [అని ఆదుర్దాగా అంటుంది)

కుటుం:-అన్నయ్యనూ ట్రాన్సుఫర్ చేశారట మనవూరికి. యీ ప్యాసింజరుకే వస్తున్నాడు.

శాంత:- ఎంతకాలానికి వస్తున్నాడు? అన్నయ్య పిచ్చిగాని, యిక్కడేవుండి యింకోవుద్యోగం చూసుకుంటే సరి పోదూ? క్రిందటిసారి వచ్చినప్పుడు ఆవూరి నీళ్లుపడక ఎలానో అయిపోయాడు.

కుటుం:-ఆ వుద్యోగం కావాలనే అందులో చేరాడు.

శాంత:-అసలు ఆ వుద్యోగమే నాకు నచ్చలేదునాన్న.

కుటుం:-అందులో చేరడం అన్నయ్య వుద్దేశ్యమే వేరు. బ్లాకు మార్కెట్టు అరికట్టటానికి తనుచేసే వుద్యోగం ఎంతో ఉపయోగపడుతుందనే చేరాడు. వీడి వక్కడివల్ల....

శాంత:-అదేమిటిలేనాన్న. అన్నయ్యలాగు ప్రతీ వక్కరూ ఖచ్చితంగా పనిచేస్తే ఎందుకు జరుగుతుంది బ్లాకు మార్కెట్టు? ట్రయినింగుకు వెళ్లకముందు మనవూరి

వ్యాపారస్తుల్ని హడలుగొట్టేవాడు అన్నయ్యా అతని ఆశయాలకు తగ్గట్టుగానే ఆ వుద్యోగం దొరికింది.

కుటుం:- మహా ఘనకార్యమే చేశాడు. వీడి మూలాన్నేగా ఎంతో స్నేహంగా వున్న సుబ్బయ్య శెట్టికి మనకూ విరోధం వచ్చింది. వాడికివ్వాల్సిన బాకీ నిముషాలమీద యివ్వక పోతే యిల్లూ, తోటా వేలం వేయిస్తానన్నాడు. వీడు చేసిన అడ్డమయిన పిచ్చిపనులకు నలుగురి పెద్ద మనుష్యుల్లో తిరగలేక తలవంచుకుపొగలసి వస్తుంది!

రంగ;-[ప్రవేశం] మామయ్యా! తలవంచుకు పోవట మేమిటి? అంత అమర్యాద చేసేవాడెవడు. మాతిమీ పంతొ్రప్పా నంటే మూడులో కాల్ ముండమొయ్యాల్సిందే ఏమను కున్నారో. చెప్పు మామయ్యా వాడ్ని ఆదుర్మార్గుడ్ని

కుటుం:- ఏమిట్రాయిదీ?

రాము:- రాత్రి నిర్దోషిసినిమా కెళ్లాం నాన్న, సరిగ్గ బావ లాంటివాడె అందులో ఒకడున్నాడు, వాడిమాటలు కాస్తా బట్టీపట్టాడు.

శాంత:- అందుకే యిక్కడ వప్పగించేస్తున్నాడు. యింకేం రాజుకి తగ్గ బంటువే దొరికావు, బాగానేవుంది.

రంగ:- ఏంటమ్మా గొణుక్కుంటున్నావ్? నీకన్నా మా రాామే మంచోడు సరదాగావుంటాడు, ఏరా రాముఅం తేకదూ?

రాము:- గూడ్ గుడ్ అంతేబావా

కుటుం:- కూర్చోరా రంగా! వూరంతాచూచొచ్చావా?

రంగ:- వో, చూచాను.

కుటుం:- ఒరెయ్ రామూ, రేపు బావని మన కొబ్బరితోటకు తీసుకెళ్ల రా.

రాము:- అలాగే నాన్న, రా బావా నీకు బొమ్మలపుస్తకం చూపిస్తా.

రంగ:- పదా (అని యిద్దరూ వెళతారు)

కుటుం:-వట్టి అమాయకుడు, తెల్లనివన్నీ పాలు నల్లనివన్నీ నీళ్లు అని అనుకునేరకం, మీ మేనత్త చచ్చి ఎక్కడుందో గానీ అంతా ఆమె పోలికే.

శాంత:- అలాగానాన్న (నవ్వుతుంటుంది)

కుటుం:- నీ చిన్నతనంలో ఆమె చనిపోయింది. నిన్ను చూచి ఎంత ముచ్చట పడేదనుకున్నావ్ శాంతా! రంగణ్ణి నిన్ను ఒక్క దగ్గరగా కూర్చోబెట్టి మురిసిపోయేది. దాని పంచప్రాణాలన్నీ నీమీదే వుండేవి. దానిఆశ నిరాశచేశాడు యీపాడు దేవుడు, ఆమె ఆఖరిగడియల్లో రంగణ్ణి నాచేతిలోబెట్టి శాంతనిచ్చి పెండ్లి చెయ్యన్నయ్యాఅని కళ్లనీళ్లొదిలింది. అలాగేనని వాగ్దానం చేసాను అప్పుడు ఆమెకళ్లు ఆనందంతో మెరిశాయి——అంతే— అదే ఆఖరిచూపు.

శాంత:- (దుఃఖాన్ని మింగుతూ) నాన్నా (అని ఏమో చెప్పబోతుంది.)

కుటుం:- ఏమమ్మా!

శాంత:-ఏంలేదు నాన్నా [అని వెళ్లిపోతుంది]

కుటుం:-అమ్మాయి ... శాంతా ... అయ్యో పిచ్చితల్లీ. ఎంత జాలిగుండెమ్మా నీది. ఎప్పుడోపోయిన మేనత్త మాట చెప్పితే ఎంత బాధ పడ్డావమ్మా

కొండ:-బాబూ! [బయటనుంచి]

కుటుం:-ఎవరూ?

కొండ:—[ప్రవేశించి] నేను బాబయ్యా కొండడ్ని.

కుటుం:—ఏరా ఏం వచ్చావ్?

కొండ:—ఏం లేదు దొరా! కూలి పట్టుతాలీకు ఎల్లిపోనానిగదూ. అందుకని వచ్చానుబాబు లచ్చి జీతం యిప్పిత్తారా?

కుటుం:—ఓ! అదా సంగతి. వూరికే రావురా. లచ్చిలాగ నువ్వూ మంచి తెలివి గలవాడవురా!

కొండ:—ఏదో లే బాబూ అలా బతుకుతున్నాం.

కుటుం:—[పదిరూపాయలు యివ్వబోతాడు. లచ్చి వస్తుంది]

లచ్చి:—జీతం వాడిచేతి కివ్వకండి బాబు

కుటుం:—ఏం!

లచ్చి:—దొంగసారా తాగి యిల్లనక వాకలనక నన్నిడిచిపెట్టి నానా యాతనచేస్తున్నాడు. [కొండడితో] ఆ రామి దగ్గిరకేపోక మళ్లా యిక్కడికి తయ్యారయ్యావు. నా నోట్లో మట్టి కొట్టటానికి.

కుటుం:—ఏమిటి లచ్చి ఎందుకలా నోరు పారేస్తావు.

లచ్చి:—మీకు తెలీదండీ బాబుగారు. వీడి తొలి పెళ్లాం వీడిబాధ పడలేక బాయిలో పడిచచ్చింది. దాని పుసుకు పోసుకున్నాడు. మా వూళ్లో వీడికి ఎవరూ పిల్లనియ్యకపోతే మేనరికంఅని మా అమ్మా బాబు వీడికినన్ను కట్టేరు. తెలుసుండే నా గొంతు కోసారు. యిప్పుడు నాపుసుకు వాళ్లు పోసుకుంటున్నారు పెళ్లి మొదల్లో నాకేమి తెలిసేదికాదు. వ్యాపారం చేస్తానని కల్లి బొల్లిమాటలుచెప్పి నా మెళ్లో నాను అమ్మేసి తాగి పాడు చేసాడు. ఆ రామిని మరిగి

నన్నాదరించకపోతే మీావంచన చేరా. యీాకూటినీ
తన్నేయాలని చూస్తున్నాడు యిసప్పాములాగ.

కొండ:—నేనుబాబయ్యా అంతాఅబద్దం, పచ్చిఅబద్దం. నాను.

లచ్చి:—చీ, నోరుమూయి, కాదా అబద్దం దొంగ నచ్చినోడా!

కుటుం:—[కోపంగా] లచ్చీ! ఏమిటదీ కిట్లూా నువ్వ్యానూ.

కొండ:—అంతేనండీ దానియిట్టం వచ్చినట్టు తిట్టేత్తాది దొంగ
ముండ. తాగేమాట నిజమేబాబు కాదన్ను కానీ
యికముందు తాగనుబాబయ్యా!

లచ్చి:—ఎన్నిసార్లుఅనలా తాగననీ! పైగా వొట్టేసుకోలే

కుటుం:—ఉండు లచ్చీ వాడ్ని పూర్తిగా చెప్పనియ్యి

లచ్చి:—వాడీయన్నీ అబద్దాలే

కొండ:—వోయబ్బో! నీమాటలేనిజం చూడుబాబు, రామి గీమి
అంటాదెగాని .... అంతా దీనిబెమ దానికినేనేటి
సేసేది?

లచ్చి:— వూళ్ళో అందరూ అనుకోవటంలా?

కొండ:— ఆళ్ళకి కళ్ళుపోనాయి నీకూపోనాయా?

లచ్చి:— అందుకనేగా యీాగతొచ్చింది నువ్వ్యే మంచోడివైతే
(అని ఏడుస్తూ లోపలికిపోతుంది.)

కొండ:— దీందంతా దొంగేడుపు బాబయ్యా! దీనిమాట నమ్మ
కండీ.

కుటుం:— కొండయ్యా నువ్వెళ్ళు తరువాత పంపిస్తాలే

కొండ:— (చేతులు నలుపుకుంటూ) చిత్తం బాబయ్యా! ఒక
రూపాయి దయచేయించండి. యింట్లో బియ్యంనేవు
సేను మప్పావలాబెట్టి బాకుమార్కెట్టులో కొనుక్కో-
వాలి పావలా కూరకిసరిపోతుంది.

కుటుం:- ఊఁ (చిన్ననవ్వుతో ఒకరూపాయి యిస్తాడు)

కొండ:- (రూపాయి తీసుకొని) మరిపోతాను బాబయ్యా! (వెళతాడు)

కుటుం:- బాగానేవుంది దాంపత్యం.

ప్రకా:- (వస్తూనే) ఎవరి దాంపత్యం నాన్నా!

కుటుం:- మన లచ్చిమాటలె

ప్రకా:- యింకా ఆకాపురం చక్కబడలా వాడు పట్టి తాగు బోతు (అని కోటుతీసి వంకీకి తగిలిస్తాడు.)

కుటుం:- పుర్రెతో పుట్టినబుద్ధి పుడకలతోగాని పోదు. వాడి గతి అంతే.

ప్రకా:- అదేమిటి నాన్న! మధ్యపాన నిషేధం పెట్టారుగదా! యిటువంటివాళ్ళ ఆటలు యికసాగవు.

కుటుం:- ఆఁ సాగనివ్వకేంచేస్తారు. అప్పుడు బహిరంగంగా తాగే వాళ్లు యిప్పుడు నిర్భయంగా దొంగసారా రహస్యం గా తాగుతున్నారు. దీనివల్ల బీదలకు ప్రతిఫలం ఏమిటి? ధనానికి ధనం. ఆరోగ్యానికి ఆరోగ్యం నాశనం చేసుకోవలసి వస్తుంది, నిషేధం పెట్టారుగానీ అందువల్ల ఏమీలాభంలేదురా! ఆర్థికంగా ప్రభుత్వానికికూడా దెబ్బే,

ప్రకా:- ఏమిటినాన్నా ప్రతీ విషయాన్ని చాలా చిన్నచూపుతో చూస్తారు. ప్రభుత్వం తలపెట్టిన ప్రతిపనీ ఆదర్శవంత మైనదే. అందుకు ప్రజలు ప్రభుత్వానికి సహాయపడాలి.

కుటుం:- ఆదర్శంకాదని ఎవరంటారు? ఆచరించేవాళ్లులేరు కానీ ప్రభుత్వానికి ప్రజలు సహాయపడాలి అంటే తిండీ,

గుడ్డకు లోటులేకుండా జీవనభృతి గ్యారంటీ వున్నరోజున ప్రజల దృష్టి మరోసమస్యమీద కేంద్రీకరిస్తారు. అటుఅంటె మార్పు జరుగనినాడు. న్యాయా న్యాయాలు, నీతి నియమాలు దూరంగానెట్టి, సుఖ పంతమైన జీవితాన్ని గడపటానికి ఆశిస్తారు. అందుకు కావలసింది కేవలం ధనం.

ప్రకా:-ధనం, ధనం, ధనం లేకపోతే ప్రపంచంలో బ్రతకలేమా?

కుటుం:-ఆఁ బ్రతుకుతున్నావుగా! నీ జీతపురాళ్లు నీకే చాలవు. పైగా పాతికా పరకా పంపమని ప్రతీనెలా వేధించుకు తింటున్నావు. చూడు నాయనా? నీకు బాధ్యత అంటూ లేనప్పుడు నీ ఆశయాలు, ఆదర్శాలు వేరు. యిప్పుడు నీవు పెద్దవాడవయ్యావు యింటి వ్యవహారాలు సరిదిద్దుకోవల్సిన అవసరం నీ కిప్పుడు ఎంతోవుంది. నీ చెల్లెలు శాంతకు యుక్తవయస్సు వచ్చింది. ఆస్తికి తగ్గట్టు అప్పులున్నాయి.

ప్రకా:-యింతకూ మీరు చెప్పేదేమిటి?

కుటుం:-నీ చిన్ననాటి ఆదర్శాలకి, యీనాటి నీయింటి పరిస్థితికి సంబంధం ఏమీ లేదురా! పరిస్థితులనుబట్టి మనమూ మారాలి. లేకుంటే ముందు ముందు విషమ పరిణామాలు ఏర్పడతాయి. ఆలోచించు.

ప్రకా:-అయితే ఏంచెయ్యమంటారు?

కుటుం:-చూడు ప్రకాశ్! గోపాలరావ్ నీకోటి వుద్యోగేనా?

ప్రకా:-అవును?

కుటుం:-యీరోజు ఆయనస్థాయి ఆలోచించు.

ప్రకా:—అయితే వాడిలాగు జీవితాన్ని గడపమనేనా మీఉద్దేశ్యం?

కుటుం:—వాడికేం మహారాజులా బ్రతుకుతున్నాడు. ఆస్తీ, అంగూ చేకూర్చుకున్నాడు. నలుగుర్లో కీర్తికి, కీర్తి, ధనానికి, ధనం సంపాదించుకున్నాడు.

ప్రకా:—[కోపంగా, ఆవేశంతో] ఎందుకు సంపాదించుకోడూ? ప్రజల ప్రాణాలతో చెలగాటమాడే దొంగవర్తకుల అండచేత, అధికార దుర్వినియోగం చేసి. అటువభుత్వం కన్నుకప్పి, యిటు ప్రజల పొట్టలగొట్టి, తన ఉద్యోగ ధర్మానికి ఉరిపోసి, సంపాదించుకున్న లంచాలతో మేడలూ కడతాడూ. కార్లూ కొంటాడు. మేఘాల్లో నడుస్తాడు. యిలాంటి నీచులు, దొంగలు, దేశ ద్రోహులు, తయార్యారయ్యారు కాబట్టే యీ రోజు దేశం అధోగతై; అంధకారంలో అలమటిస్తుంది. నాన్నగారూ! యీ నీచమైన బ్రతుకు బ్రతకమనేనా నాకు ప్రబోధం చేస్తున్నారూ?

శాంత:—[ప్రవేశము] అన్నయ్యా! ఏమిటిది?

ప్రకా:—ఏమీ లేదమ్మా

శాంత:—ఏమిటినాన్న! అన్నయ్య యింటిలో అడుగుపెట్టేడో లేదో అప్పుడేవాదన, అన్నయ్యా! ఎప్పుడూ వున్న గొడవేగా, స్నానముచేసి భోంచేద్దుగాని లే అన్నయ్యా [యిద్దరూ వెళ్ళతారు]

[రంగడు ప్రవేశము]

రంగ:—మామయ్యా, మామయ్యా ప్రకాశము వచ్చేడే

కుటుం:—అవునురా, ఈ వూరు బదిలీ చేసారు.

రంగ:-ఏ ముద్యోగము మామయ్యా
కుటుం:-స్మగ్లింగ్ ఆఫీసరు
రంగ:-ఆఫీసరే! అయ్ బాబోయ్ కలకటేర్ కంటె గొప్ప ఉద్యోగమన్నమాట
కుటుం:-[చిన్నగా నవ్వి] అది కాదురా వెఱ్ఱి సన్యాసి బ్లాక్ మార్కెట్టుచేసేవాళ్ళను పట్టుకోవటం ప్రభుత్వాని కప్పగించటం.
రంగ:-ఏమిటేమిటీ! బ్లాక్ మార్కెట్టోళ్లను పట్టుకోవటమే! మానాన్న చేసే వ్యాపారము అదేగామామయ్యా మొన్న మానాన్నను పట్టుకొన్నారు కాని ప్రభుత్వాని కప్పగించలేదేం మామయ్యా.
కుటుం:-బహుశాలంచమిచ్చి వుంటాడులే
రంగ;-ఛీ! లంచమేమిటి, లంచమా, మామయ్యా! తాంబూలములో పెట్టి 500 రూ॥ కట్నముగాయిస్తే నేను కళ్ళారా చూచేను.
కుటుం;-దానిపేరే లంచమురా
రంగ;-అలాగ. నాకేంతెలుసు మామయ్యా! లంచమంటే కట్నం కట్నంఅంటే లంచమన్నమాట. బాగుంది, బాగుంది, చాలా బాగుంది మరి నాపెళ్ళికి ఎంత లంచమిస్తావ్ మామయ్యా.
కుటుం;-ఛీ! లంచమేమిటిరా. పెళ్ళివిషయంలో దానిని కట్నం అనిఅంటారు.
రంగ;-అలాగా నాకేంతెలుసు మామయ్యా!

[రంగడు లోనికి వెళ్తాడు భాస్కరం ప్రవేశము]

భాస్క ;-నమస్కారమండి

కుటుం:- [నమస్కరించి] రా భాస్కరం యిలా కూర్చో, మంచి సమయానికే వచ్చేవు. మా పెద్దబ్బాయి ప్రకాశానికి ఈ వూరు ట్రాన్స్ఫరు అయింది యింతకు ముందే వచ్చేడు, ఈపూట అమ్మాయికి శెలవిప్పించాలి

భాస్క:- అలాగేలెండి! మీ అబ్బాయిగారి పేరు వినడమే గాని యింతవరకు చూడలేదు లోపలవున్నారా?

కుటుం:- కాస్సేపు కూర్చో! మాట్లాడి మరీ వెళ్ళొచ్చు చూడు భాస్కరం, శాంతతోపాటు వాడి పెళ్ళి చెయ్యాలనే అనుకుంటున్నాను. వాడి అదృష్టమేమిటో గాని మంచి మంచి సంబంధాలేవచ్చినయ్. కాని ఏమిలాభం సాంప్రదాయం మంచిదైతే పిల్ల బాగోలేదనో, పిల్ల బాగుంటే సాంప్రదాయం బాగోలేదనో ఆ రెండువిషయాలూ అనుకూలంగావుంటే కట్నాలు పుచ్చుకోననో ఏదో వంకబెట్టి అసలు పెండ్లేవద్దని మొరటుగా సమాధాన మిస్తాడు. అసలు వాడి తత్వం అర్థం చేసుకోవడం చాల కష్టంగా వుంది.

భాస్క:-ఆయనఅభిప్రాయమేమిటో తెలుసుకోలేకపోయారా?

కుటుం- ఫలానా అని చెప్తేగా తెల్సుకునేందుకు.

భాస్క:- ఏదైనా ఆదర్శ వివాహం చేసుకోవాలని అభిలాష కలిగి వుండొచ్చు. లేకపోతే యిదివరికే ఎవరినన్నా ప్రేమించి వుండొచ్చు, అదీకాకపోతే దేశసేవ చేయ డానికి త్యాగమూర్తియై. . . .

కుటుం!- త్యాగం! దేశం! ఆదర్శం! ప్రేమ! యిలాంటి వ్యర్థపుమాటలు మీ బుర్రకుకూడా ఎక్కినవేమిటి. కొంపదీసి

భాస్క:- కుటుంబరావుగారూ! నా కొక్కడికేగాదు యదార్థాన్ని గమనించి ఏకిమంచో ఆచరించే ప్రతివ్యక్తి బుర్రల్లోకీ ఆమాటలే ఎక్కినయ్. అందుకు ఎన్ని కష్టనష్టాలునైనా ఎదుర్కొని ఆచరించే ధీరులు అనేకమంది యీనాడు బయలుదేరుతున్నారు.

కుటుం:- ధీరులుకాదు! భీరులు యింటిని చక్కబెట్టలేని దౌర్భాగ్యులు దేశాన్నేం వుద్ధరిస్తారు.

భాస్క:- అలా అవమానించకండీ, అందరం పరస్పర సహకారంతో కష్టపడి పనిచేసిన ఎంతటి క్లిష్టసమస్యలనైనా పరిష్కరించుకోవచ్చు. అది కుంటువడ్డం వల్లనే నేడు మనము యీ హీనస్థితిలో వున్నాం.

శాంత;-[ప్రవేశించి] నమస్కారం మాష్టరుగారూ

భాస్క;-[తిరిగి నమస్కరిస్తాడు].

శాంత;-నాన్నా మీరు భోజనానికి లేవండి.

కుటుం;- అలాగే నమ్మా [కుర్చీలోనుంచిలేచి] ప్రకాశాన్ని యిప్పుడే పంపిస్తాను వుండు భాస్కరం. నీవు వచ్చి చాలాటైం అయింది. [వెళ్తాడు]

శాంత;- పాపం! చాలా శ్రమ యిచ్చాం అనుకుంటా.

భాస్క;-శ్రమేమిటిలే. తమకు ఈ పూట శెలవిచ్చాం.

శాంత;- కారణం ఏమిటో?

భాస్క;-అన్నగారు వచ్చారని ఆనందంతో ఊపిరి సలపక ఉన్నారటగా తమరు!

శాంత;- ఓ! అదా? అలాగ్రహించి ఇలా అనుగ్రహించి శెలవిచ్చారన్నమాట. చాలాసంతోషం. ఎంత ఉదార స్వభావులండి!

భాస్క;-మధ్య మన ఉదార స్వభావం ఏమిటిలే. కూతురు
వైపు వాదించి శెలవిప్పించారు మీా నాన్నగారు.

శాంత;-అలాగా! [వ్యంగ్యంగా అంటుంది ప్రకాశం ప్రవేశం]

ప్రకా ;-అరే భాస్కరం, ఏమిటియిలా వచ్చావ్? నేనొచ్చా
నని ఎవరు చెప్పారు! ఏమిటీ విశేషం!

శాంత;-ఆయన నీకు తెలుసేమి టన్నయ్యా!

ప్రకా ;- తెలుసేంటి. మేమిద్దరం క్లాస్‌మీాట్సు అయితే.

శాంత;-బాగేనేవుంది. ఆయన సంగీత మాష్టరుఅన్నయ్యా
నాకు సంగీతం చెప్తున్నారు.

ప్రకా:- సంగీత మాష్టరా?

భాస్క:- అవునా!

ప్రకా:- భేష్, బాగుంది మనం కలుసుకోని యిప్పటికి అయిదు
సంవత్సరాలయిన అయివుంటుంది.

శాంత:- యింకేం, స్నేహితులిద్దరూ ఒక్కచోటే చేరారన్న
మాట.

భాస్క:- మరేమనుకున్నవ్.

శాంత:- అయితే మీాకు జీతం యికమీాదటసున్నా అన్న
మాటే (అని నవ్వుతుంది.)

భాస్క:- ఓ మైగాడ్! ఏరా నీవొచ్చి నాజీతం కట్ చేసేవే!
తిండికి కష్టంరాబాబు. ఆపనిమాత్రం జేయకు. నీస్నే
హానికో నమస్కారం (అని నవ్వుతాడు)

ప్రకా:- ఏడ్చావ్ లేరా. నీకుకావలసినంత తిండి పడేస్తాం రారా
(అందరూ నవ్వుతారు) నీపాటవిని చాలాకాలం
అయింది. ఒక్కపాట పాడరా.

భాస్క:- నాపాటేం వింటావుగాని మీశాంత ఎంతచక్కగా పాడుతుందనుకున్నాన్.

ప్రకా:- ఆ! అలాగా.

శాంత:- అవంతా మీమెప్పైనప్పేగా!

భాస్క:- ఎంత మెప్పైనప్పైనా గొంతులో సరుకు వుండొద్దు.

ప్రకా:- ఆమాట నిజమేలేరా,

భాస్క:- చెల్లెలిగారిపాట వినకుండానే పొగిడేస్తున్నావే.

ప్రకా:- నోర్మూయిరా గొప్ప సంగీతవిధ్వాంసుడివి బయలు దేగాన్ (అందరు నవ్వుతారు.)

శాంత పాటపాడుతుంది

కోయిలా! పాడవే!
కోయిల, పాడవే, తీయనిరాగము ||కో||
మనోవాంఛలు, తీరేవరకు
మధురామృతమును గ్రోలేవరకు ||కో||
మయూరము, మందహాసముతో
తక్కుచు, తారుచు నాట్యముచేయ ||కో||
వడివడిగా సుడులు తిరిగే
వలపులవారధి, మదినిగాంచ ||కో||

(రంగడు ఆఖరునవచ్చి చాలాసంతోషంతో చప్పట్లుకొట్టాడు.)

[తెర]

# వాగ్దానం

## 3వ రంగం

సుమయం సాయంత్రం 4 గంటలు.

(కుటుంబరావుగారి వరండాలో)

కుటుం:- ఇంతకూ ఏమంటావురా?

ప్రకా:- అనటానికేముంది నాన్న! ఇప్పట్లో పెండ్లి చేసుకోవాలనే వాంఛలేదు.

కుటుం:- వాంఛలేకపోవడమేమిటా? దాదాపు పాతికేళ్లు వస్తుంటే, నీ పెండ్లితోపాటు శాంతపెండ్లి కూడా చేయాలని అనుకుంటున్నానురా. ఖర్చులో ఖర్చు నీవు కాదంటే దాని పెండ్లికూడా ఆగిపోతుంది.

ప్రకా:- కారణం?

కుటుం:- నీకు తెలియందేం కాదు. మన ఆస్థి పాస్తుల వివరాలు అయినా మరొకసారి చెప్తాను విను. ఎనిమిదివేల రూపాయలు మీ రామయ్య మామగారికి మనం బాకీ. మనయిల్లు అమ్మితే పదివేలు వస్తాయి. వడ్డీకి అసలుకి అది సరిపోతుంది. ఎటుతిరిగి వున్నతోట ఒక్కటే మనకు జీవనాధారం దాన్నిగూడా పోగొట్టుకుంటే మనం ఏ పరిస్థితికి పోతామో బాగా ఆలోచించు.

ప్రకా:- పెండ్లికి దీనికి సంబంధం ఏమిటినాన్నా?

కుటుం:- ఇంకా తెలియకపోతే ఎలా చచ్చేదిరా. అమ్మాయి పెండ్లి చేయాలంటే కనీసం మూడు వేలయినా కావాలి

ప్రకా:- అందుకు నన్నేం చేయమన్నారు?

కుటుం:- నీవేమీ చెయ్యక్కరలేదు. పెండ్లిమాత్రం చేసుకో మంటున్నా.
ప్రకా:-అదేమిటినాన్నా! శాంత పెండ్లికే డబ్బు కొరతగావుంటే
కుటుం:- నీపెండ్లికూడా ఎలా అవుతుందనేనా నీ అనుమానం అదంతా నేను చూసుకుంటాలే. తహశీల్దారుగారి అమ్మాయి కమల నీకు తెలుసున్న పిల్లేగా.
ప్రకా:- ఆ...
కుటుం:-చక్కని గుణగణాలు గల అమ్మాయిరా ఇప్పుడు ఫోర్తు ఫారం చదువుతుంది. రామచంద్రరావుగారుకూడా రొమ్మస్యాడు, అయిన సంబంధం, మనకాళ్ల దగ్గరకువాళ్లే వచ్చారు. పైగా మూడువేల రూపాయలకట్నం దాంతో అమ్మాయిపెండ్లి నీపెండ్లి ఒక్కసారే జరిగిపోతుంది ఏచీకూ చింతావుండదు.
ప్రకా:- నాన్నా! క్షమించండి నేను నిత్యమూ దూషించి హేయంగా చూస్తున్న ఈ నీచపు వరకట్నపు పద్ధతులను నన్నే ఆచరించమంటారా?
కుటుం:- నీచపు వర కట్నపు పద్ధతులేమిటిరా. యీలోకంలో మనం వున్నంతకాలం మనకు యిష్టమున్నా లేకపోయి నా యీలోకపు పద్ధతులను అనుసరించి పోవలసిందే. పరస్పర సహాకారంకోసం ఈ వరకట్నపు పద్ధతులు పెద్దలు పెట్టారు. వాటిని అర్థంచేసుకోలేక మనం ఏడుస్తున్నాం గాని...
ప్రకా:- నాన్నా! పెద్దవాళ్లు మంచి చెప్పినా చెడ్డచెప్పినా అనుసరించి తీరవలసిందే నన్నమాట స్వంతబుద్ధి స్వప్రయోజకత్వమూ లేదన్నమాట.

కుటుం:- నీ ప్రయోజకత్వం ఏమిటో కానియ్యి. ఇంతకంటె మంచిమార్గం ఏదైనావుంటే చెప్పు. నీయిష్టప్రకారమే చేద్దాం

ప్రకా:- నాయిష్టం ఏముందినాన్నా మరోవిధంగా శాంతపెండ్లి చేయటానికి అవకాశంలేదు?

కుటుం:- వుంటే నీవేచెప్పు అయినా తహశీల్దారుగార్కి మాట యిచ్చాను.

ప్రకా:- ముందు వెనుకా ఆలోచించకుండా పెండ్లిండ్ల ఏర్పాట్లు వాగ్దానాలు ఎట్లాచేస్తారో అర్థం కావడంలేదు.

కుటుం:- నీకెలా అర్థం అవుతుందిరా నీవూ నాలాగే నల్గురు పిల్లల్నికని వాళ్ళ బాధ్యతలు స్వీకరిస్తే ఆరోజున అర్థమౌతుంది. మీకు పెళ్ళిళ్లు కాకపోతే నలుగురు నవ్వుతారనిగాని మీకేం.

ప్రకా:- అసలు నేను పెండ్లి చేసుకోను.

కుటుం:- ఆజన్మాంతం బ్రహ్మచారిగా వుంటావా?

ప్రకా:- ఉంటే వుంటాను.

కుటుం:- వంశాన్ని ఉద్ధరించటానికే పుట్టావురా. ప్రకాశం! పిచ్చి పిచ్చి ఆశయాలతో బుర్ర పాడుచేసుకోక బాగా ఆలోచించి ఒకదారికిరా (కుటుంబరావు యింట్లోకి వెళ్తాడు. ప్రకాశం ఆలోచనలో పడతాడు రంగడు వస్తాడు.)

రంగ:- ప్రేమవేరు, పెండ్లి వేరు. బంధం వేరు.

ప్రకా:- నీబొందవేరు.

రంగ:- ఆ! బొందా . . .

ప్రకా:- గోలచేయకుండా లోపలికిపో. అతిగా వాగావంటే.

రంగ:- ఏమ్ నేనిప్పుడెవర్నో తెలుసా. నీకు కాబోయే బావ గార్ని ఏమనుకున్నావ్? జాగ్రత్త! యీయింటికి అల్లుణ్ని తెలుసా?

ప్రకా:- ఏక్స్ప్రెల్లే పో జగ్గర్

రంగ:- నన్ను యింగ్లీషులో తిడుతున్నావ్ కదూ తిట్టు తిట్టు నాకూ వచ్చులే ఫూల్ గేల్, డాంఫూల్ అని. అయినా నేనెందుకు తిట్టాను. మా మామయ్యాతో చెప్పి అయ్యా గారిపని అప్పుడు ఉ. ఉ. (అని పిడికిలి బిగించి ఏడుపు మొఖంతో లోపలికి వెళ్తాడు.)

ప్రకా:- (నవ్వుతూ) వెఱ్ఱి వెంగళప్ప (శాంతవస్తుంది)

శాంత:- అన్నయ్యా!

ప్రకా:- ఏం శాంతా!

శాంత:- నీవు నాన్నాతో మాట్లాడిందంతా విన్నా.

ప్రకా:- అయితే ఏ మంటావ్?

శాంత:- నీలాగే నాకూ పెండ్లి చేసుకోవాలని లేదన్నాయ్.

ప్రకా:- అదేమిటి శాంతా?

శాంత:- నా పెండ్లివల్ల నీ ఆశయాలు ఆదర్శాలు నాశనం కావటానికి నేనంగీకరించను.

ప్రకా:-నా ఆశయాలకు దెబ్బతగలకుండా ఇంకో విధంగానైనా నీ పెండ్లి చేస్తాం.

శాంత:- అదీ కష్టమే అన్నాయ్

ప్రకా:- కారణం?

శాం- నా పెండ్లి కొఱకు నిన్ను కట్నాలు పుచ్చుకొమ్మని నాన్న ఏ విధంగా బలవంతం చేస్తున్నాడో, నా వివాహ

విషయంలో కూడా రంగయ్యా బావను చేసుకోమని నిర్భందిస్తున్నాడు.

ప్రకా– అది యిప్పటి మాటకాదే నీ చిన్నతనంలోనే వాగ్దానం అయిపోయింది.

శాంత:– అదినాకు తెలుసు కాని నీయుద్దేశ్యం ఏమిటన్నాయ్?

ప్రకా:– నాన్నగారిమాట అంగీకరించమంటాను.

శాంత:– కారణం?

ప్రకా:– మాట యిచ్చారు గనుక

శాంత– నీ పెండ్లి విషయంలో కూడా తహశీల్దారు గారికి మాట యిచ్చాడు. మరి ఆ వివాహం చేసుకోవేం. నీ ఆదర్శాలు నీ త్యాగాలు, నీ ఆవేశాలు కేవలం నీ కొరకే నన్నమాట నీ స్వార్థంకోసం. . . . .

ప్రకా:– శాంతా! ఏమిటిగొడవ. నేనేమన్నా తప్పుగా మాట్లాడానా?

శాంత:– ఒప్పుగానే మాట్లాడావ్ మా యీ దాంపత్యం అనుకూలంగా వుంటుందనేనా నీ ఉద్దేశ్యం?

ప్రకా:– చిక్కుప్రశ్నే! ఇదా నీకోపానికి కారణం అసలు రంగణ్ణి చూస్తేనే నాకుమంట. చిన్నప్పట్నుంచి వాడు పట్టి పోకిరీ వెధవగా పెరిగాడు నాకు తెలుసు

శాంత:– తెలిసుండీ నాపీకకు వురితాడు తగిలిస్తున్నారన్న మాట

ప్రకా,– ఎప్పటికయినా తిన్నగా రాకపోతాడా అనే ఆశ ఒకటుంటుందిగామరి, కాని ఒక్కవిషయం నాకూ యీ సంబంధం అసలు యిష్టం లేదు

శాంత:– నిజంగా అన్నాయ్!

ప్రకా:- నిజం
శాంత:- అన్నాయ్ నీతో ఒక్కమాట చెప్పాలి కోప్పడవు కదూ ?
ప్రకా:- ఊహూం !
శాంత:- అన్నాయ్ . . . నేను (సిగ్గుపడును)
ప్రకా: - సిగ్గెందుకు చెప్పు శాంత.
శాంత:- నేను మనసార ఒకయువకుణ్ణి ప్రేమించాను. అతన్నే వివాహం చేసుకొంటాను. అందుకు నీవు ఆమోదించి ఆశీర్వదించాలి.
ప్రకా:- (కోపం నటించుచు) ఆఁ ! ఏమన్నావ్ ! ఒకయువకుణ్ణి ప్రేమించావా? . . నీకేమన్నా మతిపోయిందా? ఎవడు వాడు? చెప్పు, ఊఁ చెప్పవేఁ?
శాంత,- (దుఃఖముతో వెళ్లబోతుంది.)
ప్రకా:- శాంతా! ఇంతలోకి ఆకన్నీళ్ళేమిటి పిచ్చిదానా? ఇటురా (తల నిమురుతాడు)
శాంత:- అన్నయి ఎంత విశాలహృదయం నీది.
ప్రకా:- ఇంతకీ ఆ పెండ్లికొడుకుఎవరు?
శాంత:- చెప్పనా? మన సంగీతమాస్టరు. . . భాస్కరంగారు
ప్రకా:- (ఆలోచిస్తూ) బాగా ఆలోచించే ఈ నిర్ణయానికొచ్చావా? వాడు మనకులంవాడు కాదు. ఒక వేళ రంగడి సంబంధం నాన్నవదులుకున్నా సాటికులస్తునికే ఇవ్వటానికి అంగీకరస్తారు. కాని ఈ వర్ణాంతర వివాహానికి అంగీకరించరు.
శాంత;-ఆ సంగతి నాకూ తెలును. నీ యుద్దేశ్యమేమిటి.
ప్రకాశం;-మీదాంపత్యం ఆదర్శంగానే వుంటుంది, కాని

శాంత;- కుల గోత్రాలు అడ్డుగా వున్నాయంటావ్, ప్రేమకు స్థానం హృదయమంటారు జాతి మత కులాలు కావని నాకన్నా నీకే ఎక్కువ తెలుసు. దేశాభ్యుదయం కోరే నీలాంటివాళ్ళే వెనుకడితే నాలాంటివాళ్ల గతి ఏమౌతుంది.

ప్రకాశం;- శాంతా! నాకన్నా వయస్సులో చిన్నదానివయినా చక్కని గుణపాఠం చెప్పావ్. ఇంతకాలం నాలోనున్న ఆ కాస్త దుర్బలత్వాన్ని ఈ రోజున పారద్రోలావమ్మా ఇదేనా ఆశీర్వచనం. ఎన్ని కష్ట నష్టాల ననుభవించైనా మీకు వివాహం చేసి తీరుతాను. భయపడకు.

శాంత;- అన్నాయ్! నీ ఋణం ఎలా తీర్చుకుంటానో.

ప్రకాశం;- నీ కూతుర్నిచ్చి నాకు పెండ్లిచెయ్యి. సరేనా.

శాంత;- పో అన్నాయ్. నవ్వు మరీను. [ప్రకాశం వెళ్తాడు శాంత ఆనందంతో పాట పాడుతూ వుంటుంది.]

శాంత:- చల్లని వెల్గుల చంద్రునిగాంచి
చకోర మెందుకో ఎగిరింది ॥చ॥
ఘుమ, ఘుమ
ఘుమ, ఘుమలాడే పూలగాంచి
భ్రమరము ఎందుకో భ్రమసింది ॥చ॥
ఉదయభాస్కరుని (తన్మయత్వంతో
“భాస్కరం„ అని అంటుంది) బింబముచూచి
కమలము ఎందుకో నవ్వింది.

(భాస్కరంవస్తాడు)

భాస్క:- ఎందుకూ!

శాంత:- ఎందుకో, ఏలనో,
ఎవరికెరుక ఈ ప్రకృతిశోభా ||చ||

భాస్క;-ఏవండోయ్ శాంతమ్మగారు! ఏమిటి విశేషం చాలా ఉషారుగా వున్నారు?

శాంత;-ఎందుకో చెప్పుకోవాలి.

భాస్క;-తమరు చెప్పందే ఎట్లా తెలుస్తుంది.

శాంత;-పాపం నోట్లో వెన్నముద్దపెట్టినా మ్రింగలేరు నేను చెప్పితే మీ ప్రతిభేముంటుంది. ఊహించి చెప్పండి

భాస్క;-అలాగా. అయితే చెప్తాను. ఇవ్వాళ బాటా కంపెని క్రొత్త స్టాక్ చెప్పులజతకొనివుంటావ్.

శాంత;- [నవ్వుతూ] కాదు.

భాస్క;-బెంగాల్ సిల్క్ చీరకొని వుంటావ్.

శాంత;-అదీ కాదు. ఇంతేనా మీ తెలివి.

భాస్క;-అవును అది అంతే. సంతోషంలో వున్నప్పుడు రిబ్బను కొన్నావనో.

శాంత;-చాలు చాలు. ఆగండి. నే చెప్తా!

భాస్క;-ఓయస్.

శాంత;-అబ్బాయిగారి పెండ్లి. [నవ్వుతుంది]

భాస్క;-ఏ అబ్బాయిగారికి. [నాల్గువైపుల చూస్తాడు]

శాంత;- మొద్దబ్బాయిగార్కి. తమకే. మన వివాహానికి అన్నయ్య అంగీకరించాడు.

భాస్క;- (ఆశ్చర్యంగా) ఏమిటి! మీ అన్నయ్య మన వివాహానికి. . .

శాంత:- అంగీకరించాడు.

భాస్క:-ఎంత పవిత్రదినం ఎంత ఆనందం(వ్యంగ్యంగాఅంటాడు)
శాంత:- చాల్లెద్దురూ మీమాటలు మీరూను రండి టీ త్రాగి పాఠం మొదలపెట్టొచ్చు (వెళ్లబోతాడు సుబ్బయ్య గారు వస్తాడు )
సుబ్బ:- అమ్మాయి అన్నగారున్నారా?
శాంత:- వున్నారండి పిలవమంటూరా !
సుబ్బ:-అవునమ్మా కాస్తపనుంది. (వెళ్తారు టేబుల్ మీదవున్న పేపరు తీసి చదువుతూ వుండగా ప్రకాశంగారు వస్తారు సుబ్బయ్యగారు నిలబడి నమస్కారం చేస్తారు.)
ప్రకా:- కూర్చోండి వూరికే రారు మహాత్ములు, ఏమిటీవిశేషం యిలా దయచేశారు ?
సుబ్బ:- చిత్తం, తమకు తెలియనివిషయాలేముంటాయ్.
ప్రకా:-చాలా విచిత్రంగా మాట్లాడుతున్నారే, మీ మనస్సులోనున్న విషయాలు మాకెలా తెలుస్తాయి.
సుబ్బ:- ఆః! ఏమీలేదు వాడులేడూ మా మేనల్లుడు, వాడ్ని గురించే మనవి చేసుకుందామని వచ్చానండి.
ప్రకా:-అతనెవరో నాకు తెలియదే.
సుబ్బ:- అదేమిటండి మొన్న 20 బియ్యం బస్తాలు పట్టుకొన్నారట వాడు లబో దిబో మంటుంటే మీ దగ్గరికి పరుగెత్తుకుంటూ వచ్చా, వాడిపేరు నాగభూషణం.
ప్రకా:-ఓ! అదా సంగతి అయితే తమరేమంటారు
సుబ్బ:- చిత్తం, ఏమనటానికి ఏముందండి. వాడు క్రొత్తగా వ్యాపారం చేస్తున్నాడు ఇంకా పూర్తిగా వ్యాపారలక్షణాలు అలవాటుపడక ఏదో చిన్నతప్పు చేసాడు. ఇది ప్రథమతప్పుగా భావించి విడిచిపెట్టమని ప్రార్థిస్తున్నా,

ప్రకా॥-వాడు బ్లాక్ మార్కెట్ చేస్తూ ప్రజల్ని పీడించుకు తింటుంటే ప్రథమతప్పని సమర్థిస్తున్నావా?

సుబ్బ;- సమర్థించడం కాదండి తమరిని దయతలచ మంటున్నా

ప్రకా;-దయా దాక్షిణ్యాలు కోర్టువాళ్లే చూస్తారు.

సుబ్బ;- మీరే అలాగంటే మాబోటి వ్యాపారస్తుల గతిం కెవరు చూస్తారండి. మీరు పిర్యాదురాసి పంపితే పరువుగా బ్రతికేవాడు అల్లరి పాలవడంతప్ప మీకు మాత్రం కలిసొచ్చేదేముంది చెప్పండి.

ప్రకా;-ఏమిటీ మీరు మాట్లాడేది. మాకు కలిసిరావాలసి కాదు. ఈ ఉద్యోగం చెయ్యటం.

సుబ్బ;-అలా సెలవిస్తే ఎలా చెప్పండి. మా సహాయం మీకు మీ సహాయం మాకుండాలి. ఈసారికి యిది యిలా సర్దేయండి. వాడూ ఏమీ ముట్టజెప్పలేనని అనలేదు ఏదో తృణమో, ఫణమో స్వీకరించి [నోట్లు తీస్తాడు]

ప్రకా;-[కోపంతో] షావుకారుగారు! లంచం యిస్తున్నారా?

సుబ్బ;-అయ్యో్యారామ ఎంతమాట అన్నారండి. లంచమెందు కవుతుందండీ యిది తాంబూళం ఖర్చుగా తమరు స్వీకరించాలి.

ప్రకా;- హుం! తాంబూళంఖర్చు, [చిన్న నవ్వుతో] చాలా బాగుంది. షావుకారుగారు చూడండి. నే నెవరిని... మీకు తెలుసుగా ... అంటే ప్రభుత్వ ఉద్యోగిని. ప్రభుత్వం నాకు కొన్ని ఆర్డర్లు వేసింది. దాన్ని అమలు జరుపడమేనాఉద్యోగ ధర్మం ఆ ధర్మానికి యింకోవిధంగా నడచినట్లయితే నాకు జీతం యిస్తున్న

ప్రభుత్వానికి తిండిగింజలకు కటకటలాడే బీదప్రజలకి తీరని ద్రోహంచేసినవాడ్నవుతాను. మీలాంటి దేశభక్తులే యిలాంటి నీచానికి ప్రోత్సహించడం సహించరాని విషయం.

సుబ్బు:- దేశభక్తికీ, వ్యాపారానికి సంబంధం ఏముందండి? సరుకులు సరిగ్గా సప్లైలేక మా వ్యాపారాలు స్తంభించిపోయాయి. ఏం చెయ్యమంటారు చెప్పండి. యిటు లైసెన్సులు, యిన్‌కంటాక్సులు ఆఫీసుచుట్టూ తిరగటాలు, అటు స్టాక్సు అప్లైలు, గుమస్తాలు. యిన్ని బాధలు పడుతున్నా లాభాలు మాత్రం సున్న. అందుకోసం అప్పుడప్పుడు, అక్కడక్కడా యిలాంటివి చాటుగా జరిగితే అధికారులు చూచీచూడనట్టుగా పోకపోతే అసలు మేము బ్రతకగలమా? వ్యాపారాలు చేయగలమా?

ప్రకా: ప్రతి వ్యాపారస్థుడు చేసిన తప్పును మరుగుపర్చడానికి తంటాలు పడినట్లుగానే మీరు అవస్థపడ్డారు. లాభం లేదు. మీరు వెళ్ళవచ్చు.

సుబ్బు:- మరీ మొహమాటం లేకుండా మాట్లాడకండి. నేనుగా వచ్చి యీ విషయం మాట్లాడుతున్నాను.

ప్రకా:- గొప్పవారు పేరుపడ్డ వ్యాపారస్థులని నాకు తెలుసు.

సుబ్బు:- తెలుసుండే అగౌరవించుతున్నారన్నమాట చూడండి!

ప్రకా:- మీరింకేమీ చెప్పనక్కర్లేదు. తమరు దయచెయ్యొచ్చు ఉ... వెళ్ళండి...

సుబ్బు:- (అలాచూస్తూ) ఊఁ! వెళ్తాం. బాగా ఆలోచించుకోండి మామాట కాదని ఎదిరించిన ఆఫీసరు ఈరోజువరకు ఎవరూ కనబడలేదు. నేటికి నీవుతప్పు. వెన్నెలా చీకటి

ఒకదానివెంట ఒకటిరాకుండా పోదు. శాస్త్రదూర దృష్టితో అలోచించండి. (లేస్తాడు)

ప్రకా:- మరేం పర్వాలేదు. మర్యాదగా దయచెయ్యండి

(కుటుంబరావు ప్రవేశం)

కుటుం:- ప్రకాశం!...... ఏమిట్రామాటలు...మావు కారుగారు కూర్చోండి. ఏదో చిన్నతనం, అవేశంలో ఏమో అని వుంటాడు మరేం అనుకోకండి.

ప్రకా:- నాన్నా! ఈవ్యవహారాల్లో మీరు జోక్యం చేసుకోకండి

కుటుం:- ప్రకాశం కొంచెం సూటిగా పోతానంటే చాలా ప్రమాదాలున్నాయ్. శాస్త్ర దృష్టితో పాటు తారతమ్యం గమనించాలి. సుబ్బయ్యగారు పూర్వాపరాలు తెలిసిఫున్నవారు. మన మంచికోరేవారేగాని కీడు తల పెట్టేవారు కారు. వారొచ్చిన పనిచూసి పంపించు.

ప్రకా:- లంచాలు పుచ్చుకోమనా మీ సలహా!

కుటుం:- అక్కర్లేదు లంచం పుచ్చుకోకుండా సహాయం చెయ్య ఎవరొద్దాన్నారు. వారి దగ్గిర దమ్మిడీ అడగకుండానే మా స్నేహితాన్ని నిలబెట్టు.

ప్రకా:- నాన్నగారు! స్నేహితాలకి ఉద్యోగధర్మాలకు అవినీతి వ్యాపారాలకి లంకెబెట్టకండి నాకు టైమయింది వస్తా. (లోపలికి వెళ్తాడు)

సుబ్బ:- కుటుంబరావుగారు మీ వాడి ప్రవర్తనవల్ల వ్యాపారులు నష్టపడుతున్నారు. తాను తినలేడు. ఒకరినితినవివ్వడు. అయినా మీరూ నచ్చచెప్పండి వస్తానండి. (సుబ్బయ్య వెళ్తాడు. కుటుంబరావు నిశ్చేష్టుడుగాచూస్తూవుంటాడు తెరదిగుతుంది)

# వాగ్దానం

## 4వ రంగం

### కుటుంబరావుగారి భవనంలో

(పడకకుర్చీలో రంగడు జ్వరంవచ్చినట్లు నటించుచు మూల్గుతుంటాడు)

రంగ:- లచ్చీ! ...... ఓలచ్చి...అమ్మా...అమ్మా...

రంగ:- ఒసేవ్! లచ్చీ ఎక్కడ చచ్చావే ... అబ్బబ్బ తల బ్రద్దలయి పోతుందే.

(లచ్చి లోపలినుంచి వస్తున్నా అని అంటుంది)

రంగ:- నే సచ్చినాకా నీవొచ్చేది ... అబ్బ ... అయ్యో (కుర్చీమీదనుంచి లేచి లోపలికి తొంగిచూస్తాడు) ఓసి నీ దుంపతెగ అరచి, అరచి గొంతు పగిలిపోతుంటే, గ్లాసెడు మంచినీళ్లయినా తేవేమే.

లచ్చి:- (ప్రవేశం) ఏంటండి తెగతిప్పలు పెడుతున్నారు లోపల పనే చూడనా యిక్కడ మీ అరుపులే వినేనా?

రంగ:-అరుపులా, అయింది. మావయ్య ఏం చెప్పాడు నా దగ్గర వుండి ఏమికావాలో అన్నీ చూడమన్లా

లచ్చి:-చూస్తూనే వున్నానుగా.

రంగ:- (గుటకలు మింగుతూ) చూడులచ్చీ! వచ్చినదగ్గర నుంచి నిన్ను చూస్తుంటే నాకు జాలేస్తుంది.

లచ్చి:- ఎందుకూ?

రంగ:- నీ బ్రతుకునుచూచి.

లచ్చి:- అయ్యోరామా! నీకూ జాలేసింది. ఏంచెయ్యను కర్మ

రంగ:- అదేమిటి లచ్చీ అలాగంటావ్.

లచ్చి:- ఇంకేటనను

రంగ:- లచ్చీ! నీమీద, వట్టి జాలేకాదు... గట్టిప్రేమకూడా కలిగింది.

లచ్చి:- పేమే! అమ్మనాయినో అది చాలా యిసప్రుమాట. ఆమాట వదిలెయ్.

రంగ:- నువ్వుకాదంటే నే సచ్చిపోతా.

(లచ్చిచెంగు లాగుతాడు)

లచ్చి:- ఏయ్ నీపిచ్చివేసాలు నాదగ్గరకాదు.

రంగ:- అబ్బో కోపంకూడా వచ్చిందే రాణీగారికి- పిచ్చి పిచ్చిగా మాట్లాడక యిటురా! ఊ!

లచ్చి:- ఛీ! కాస్త మంచి చెడ్డా ఆలోచించు, ఎంతదాసి దాన్నయినా నీతి జాతి మాకూ వున్నాయ్.

రంగ:- లేవని ఎవరన్నారే పిచ్చిదానా, అసలు నీమొగుడు మంచివాడయితే నీకీగతెందుకు పట్టుందీ అంట; చూడు నీ సుఖంకోరి చెప్తున్నా.

లచ్చి:- నువ్వేమి చెప్పొద్దు.

రంగ:- అదికాదు లచ్చీ! దేవుడు నిన్ను అచ్చంగా దేవతలా తయారుచేసాడు. అందుకే నీవంటే నాకిష్టం. నీవు ఊ! అను రేపీపాటికి బంగారుబొమ్మను చేస్తా.

లచ్చి:- ఛీ! మర్యాదతక్కువ మాటలు మాట్లాడక, నీ వెకిలి వేసాలు చూసి నవ్వితే...

రంగ:- లచ్చీ! నీయిష్టం వచ్చినట్లు మాట్లాడుతున్నావ్, ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?

లచ్చి:- ఆ తెలుసు.

రంగ:— ఏంటి తెలుసు! నేను తలచుకుంటే నీ తలలో జేజేమ్మను కూడా దింపుతా! ఏమనుకున్నావో.

లచ్చి:— ఇంకా ఇలా వాగావంటె బాబుగారితో చెప్పాల సొస్తది.

రంగ:— యింత మాత్రానికే తలతీసేస్తాడా చెప్పు మరేం పర్వాలేదు.! అయినా ఎందుకింత రద్ధాంతం నిన్ను పువ్వుల్లోపెట్టి పూజిస్తా, నామాటవిను లచ్చి (చెయ్యి పట్టుకుంటాడు. లచ్చి విదిలించి తోసేస్తుంది)

లచ్చి:— ఛీ మనిషి.కొక్కమాట గొడ్డుకొక్క దెబ్బ.

రంగ:— ఎంతమాటన్నావే పొగరుబోతు ముండా (అని మీదికి పోయి బలవంతం చేస్తు వుంటాడు.)

లచ్చి:— నన్నొదులు నీ కాళ్లకు దండంపెడతా, వదులు (లచ్చి అరుస్తూ వుంటుంది శాంతవచ్చి చూచి నిర్ఘాంత పో తుంది,)

శాంత:—(నెమ్మదిగా) బావా!

రంగ:— (ఉలిక్కిపడి లచ్చిని వదిలేసి దూరంగాపోయి చేతులు తడుముకుంటూ వుంటాడు.)

లచ్చి:—(ఏడుస్తు) అమ్మగారు మీరు రాకపోతే ఈ పాపిష్టోడు నన్ను నాశనం చేద్దామనుకున్నాడు.

శాంత:—ఏడవకులచ్చీ! లోపలికిపోయి నీపని చూసుకో (లచ్చి వెళ్తుంది ఇలాంటి పసువుకి నన్నిచ్చి పెండ్లిచేస్తారట.

రంగ:— ఇదిగో! మా... మాటలు జాగర్తగా రానియి.

శాంత:—ఏం! ఎందుకు జాగ్రత్తగా మాట్లాడాలి. అదనుకోసం ఎదురుచూసి ఆడదాన్ని బలత్కరిస్తావా? ఆవిడికున్న నీతి నీలో ఏకోశానా లేదే.

రంగ:- నీకుందులే మహా నీతి నీసంగతి ఎవరికి తెలియదనుకున్నావ్ పిల్లి పాలు త్రాగుతూ కళ్ళుమూసుకొని ఎవ్వరూ చూడ లేదనుకున్నదంట.

శాంత:- నీకేమన్నా పైత్యం ఎక్కిందా నోటికొచ్చినట్లు ప్రేలుతున్నావ్.

రంగ:- అంతవరకు ఆగు, ఎంతచనువున్నా దానిపై నా మాటలుమాత్రం అంతజోరుగా విసరకు. మేనకోడలని మెడకెక్కించుకుంటే మూతిమీద తన్నిందంట, ఎందుకొచ్చిందిలే అని చూచీ చూడకుండా వూరుకుంటున్నా ఇంగాని..

శాంత:- లేకపోతే వురిపెట్టుకొని చచ్చేవాడివా?

రంగ:- నోర్మూయ్! మామయ్య రానియి నిన్ను ఏమి చేయిస్తానో, ఆ సంగీతంగాడితో ఆ సరసాలేమిటో కనుక్కుంటా. ఆ గాడిదా నువ్వు కలసి మీ నాన్నగార్కి ఏమి సమాధానం చెప్తారో అదీ చూస్తా.

శాంత:- (అప్యాయంగా) బావా! కాస్త నిదానించు నీవుచేసిన ఈపాడు పనికి పశ్చాత్తాపపడక పైగా మరుగు పర్చడానికి మరొకఎత్తు వేస్తున్నావే. (తీవ్రంగా) ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకొని నీ ప్రవర్తన మార్చుకో (వెళ్తుంది)

రంగ:- నువ్వేంచెప్పక్కర్లా నీతులు (కుటుంబరావు నెమ్మదిగా వస్తాడు) లోకం ఎలాపాడైపోయింది. ఇటువంటోళ్ళుండబట్టే దీన్నికలికాలం అన్నారు అనకేం జేస్తారు. అనేసి వూరుకున్నారు.

కుటుం:- ఏమిట్రా రంగా నీలో నీవే మాట్లాడుకుంటున్నావ్. ఇంతకూ తలనొప్పి తగ్గిందా (కూర్చుంటాడు.)

రంగ;- ఆఁ! ఆ! తగ్గిపోయింది మావయ్యా పూర్తిగ.

కుటుం:-డాక్టర్ని రమ్మని కబురు చేసానులే.

రంగ;- ఇంతమాత్రనికే డాక్టరెందుకు, ఆయనరాకముందే పూర్తిగా తగ్గిపోయింది మావయ్యా... నేనివ్వాళేవూరు వెళదామనుకుంటున్నాను.

కుటుం;-ఏం! ఇంత తొందరలో యిలా నిర్ణయించావ్.

రంగ:- వచ్చి వారంరోజులయింది మా అయ్య ఎదురుచూస్తూ వుంటాడు. ఇవ్వాళే వెళ్తాను. ఏమీ అనుకోకు మావయ్యా.

కుటుం:-యిందులో బలవంతం ఏముందిలే, అలానే వెళ్లుదువుగాని.

రంగ:- మరి అయ్యతో ఏమని చెప్పను.

కుటుం:-త్వరలోనే ముహూర్తం పెట్టిస్తానని చెప్పు.

రంగ;- అలాగే మావయ్యా... మరి నేనొకటి చెప్పదలచుకొన్నా. కోప్పడవుకదా మామయ్యా

కుటుం:-కోపం ఎందుకు చెప్పు.

రంగ:- అ సంగీతమాస్టరుగాడ్ని ఇవ్వాళనుంచే మాన్పించాలి.

కుటుం:-కారణం?

రంగ:- మీకనవసరం (నాలుక కొరుక్కొని) అయినా చెప్పడం నాఅవుసరం, అతన్నిచూస్తుంటే అనుమానంగా వుంటుంది.

కుటుం:-కారణం?

రంగ:- కారణం... కారణం... ఏమీలేదు మామయ్యా, మనకొంత ఎంత చనువుకున్నదైనా వాడితో అంతచనువుగా ఉండటం నాకేమీ బాగుండలేదు.

కుటుం:-రంగా నీకు తెలియదురా పట్టణ పరిస్థితులే అటువంటివి చనువుగా వున్నంతమాత్రాన...

రంగ:- అనుమానం అనవసరం అంతేగా మామయ్యా! కాస్సేపు అలాగే అనుకుందాం మరి ఆ గుసగుసలు ఆ పక పకలు ఏమిటీ అంట.

కుటుం:-(కోపంతో వణికిపోతూ) రంగా!

రంగ:- (భయంతో) నాకు అనుమానంలేదని ముందే చెప్పాను. లోకం మావయ్యా. ఈ లోకం అనుమానం పడుతుందేమోనని నా అనుమానం. ఎందుకన్నా మంచిది వాడ్ని ఈనిమిషంనుంచే మాన్పించెయ్యండి. (లచ్చి వస్తూ వుండటంచూచి) మామయ్యా డాక్టరుగారొస్తే తల నొప్పి పోయిందని చెప్పేయ్యండి

(లోపలికి పోతాడు లచ్చివస్తుంది)

లచ్చి:-బాబుగారు! నేనింటికి వెళ్తానండి.

కుటుం:-ఏం సాయింత్రం పోదువుగాని

లచ్చి:-లేదండి. జీతం లెక్కగట్టి యిచ్చేయ్యండి.

కుటుం:- అదేమిటి లచ్చి?

లచ్చి:- మా నెయ్యాలసి ఒచ్చిందండి.

కుటుం:-ఏం! ఎందుకు?

లచ్చి:- ఏమీలేదండి యిల్లు వాకిలి చక్కబెట్టుకోవాలి, మా కొండణ్ణి మంచిగా దారిలోకి తీసుకురావాలి. కలో, గంజో అక్కడే తాగి పడుంటే తీరి పోతుంది.

కుటుం:-నీకిప్పుడొచ్చిన కష్టం ఏమిటి లచ్చి. పోని ఎవరన్నా ఏమన్నా అన్నారా!

లచ్చి:-లేదండి అందరూ నన్ను బాగానే చూస్తాను. జీతం లెక్క-గట్టి యిచ్చేసెయ్యండి.

కుటుం:-సాయంత్రం పోదువుగానిలే. (శాంత వస్తుంది)

శాంత:-ఎక్కడికి నాన్నా!

కుటుం:-లచ్చి మన యింట్లో పనమానేస్తుందట ఆమెకేదో కష్టంకలిగి అట్లా అని వుంటుంది. నీవేమన్నా అన్నావా?

శాంత:-లేదు నాన్నగారు లచ్చి వున్న విషయాన్ని చెప్పడానికి భయపడ్తావేం.

లచ్చి:-ఎందుకులే అమ్మగారు, యిదొక పెద్దగోల అయిపోతుంది నామీద లాను:

కుటుం:-లచ్చి! ఎందుకుదాస్తావ్. కొండడేమన్నా అన్నాడా.

శాంత:-కొండడుకాదు మీకు కాబోయె అల్లుడు.

కుటుం:-రంగడా! ఏమన్నాడులచ్చి.

లచ్చి:-చెప్పకుంటే నాపరువే పోతుంది. ఎందుకులెండి.

కుటుం:-ఏమైందో చెప్పు నీకేం భయంలేదు. చెప్పులచ్చి.

లచ్చి:-మీరంతా బజారు వెళ్ళినప్పుడు తలనొప్పిని యింట్లో వుండి నన్ను బలవంతం చేయబోయాడు. (మొఖం మూసుకొని ఏడుస్తూ) అమ్మాయిగారు రాకపోతే (బోరున ఏడుస్తుంది.)

కుటుం:- లచ్చి వూరుకో వాడికి నేను భయంచెప్తాతాలే. చిన్నప్పట్నుంచి అల్లరిగా తిరిగాడేమో కాస్త పొరబడి వుంటాడు పనేమన్నావుంటె లోపలికివెళ్ళు (లచ్చి వెళ్తుంది.)

శాంత:-నాన్నగారు! ఇంకా పసిపాపాయంటారా. నయాన్నా భయాన్నా చెప్పి ఒక దారికి తీసుకురావటానికి.

కుటుం:—కాదమ్మా పొరపాట్లు అందరూ చేస్తారు. ఏంచేస్తాం చెప్పు. అయినవాడు ఏమన్నా అంటే ముఖం చిన్న బుచ్చుకుంటాడు. మంచిగానే ఇదినీకు తగదురా అని చెప్పితే బాగుంటుంది ఈరోజునే వాడు ఇంటికి వెళ్తా నంటున్నాడు. మంచి లగ్నంచూసి ముహూర్తంపెట్టిస్తే ఆ బరువు కాస్త తీరిపోతుంది.

శాంత:—నాన్నగారు! అసలు నాకీపెళ్ళి వివాహం యిష్టంలేదు.

కుటుం:—శాంతా! నీ అన్నయ్యకు పట్టినపిచ్చే నీకూ పట్టిందా?

శాంత:—అవును నిజంగా పిచ్చే పట్టింది. ఎప్పుడో పోయిన చెల్లెలికి యిచ్చిన మాటను నిలబెట్టడానికి నన్ను బలిచేస్తున్నారని తెలిసిన దగ్గరనుంచి నిజంగానే పిచ్చిపట్టింది.

కుటుం:—ఏమిటే! మేనల్లుడి కిచ్చి నిన్ను పెండ్లిచేయుటం అంటె బలియివ్వటమా? నీకింత కష్టం కలగటానికి నేనేమైనా నీమెడకు కొరివిదెయ్యాన్ని కడుతున్నానా? సలక్షణమైన కుర్రవాడు పైగా మేనరికం ఆస్థిపాస్థులు లేవంటావా? కోరినంత వుంది. వీడొక్కడే ఆ ఆస్థికి హక్కుదారు. ఇటువంటి సంబంధం మనకు దొరకటం పూర్వజన్మలో ఏ పుణ్యకార్యాలు జేసామో.

శాంత:—ఆస్థిపాస్తులను చూసి అందలం ఎక్కాలనేవాంఛ లేదు.

కుటుం:—అలా అనకమ్మా ఈముసలి గుండె బ్రద్దలయిపోతుంది నేనిచ్చిన మాటను నిలబెట్టుకోలేకపోతే మనబంధువులలో ఎంత అప్రతిష్ట. నీవు కాదంటే నా పరువు ప్రతిష్టలన్నీ మంటగలిసిపోతాయి. అప్పుడు నేను జీవించినా చచ్చినవాడితో సమానం.

శాంత:—నాన్నా......క్షమించండి నా వివాహ విషయంలో మాత్రం స్వేచ్ఛ నివ్వండి ఇదొక్కటే నకోరేది.

కుటుం:—ఏమిటీ నీపెంకితనం! ఈ వివాహం జరిగి తీరాల్సిందే లేకపోతే అన్నివిధాలా సర్వనాశనం అయిపోతాం బాగా ఆలోచించుకో.

శాంత:—ఆలోచించేదేమీలేదు నాన్న.

కుటుం:—తల్లి అయినా, తండ్రిఅయినా నేనేఅని అతిగారాబంగా పెంచి పెద్దదానినిజేసి విద్యాబుద్ధులు చెప్పించినందుకు ప్రతిఫలం ఇదే నన్నమాట.

శాంత:—అంత ప్రతిఫలం కోరేవారు విద్యాబుద్ధులు చెప్పించకుండా కూపస్థ మండూకంలా పెంచి పెద్దదాన్నిచేస్తే మీ మాట కాదనలేక పోయేదాన్నే మీ అప్పుడు ఏ కొయ్యబొమ్మనో తెచ్చి వీడే నీ భర్తఅంటే...

కుటుం:— నోర్మూయ్!

శాంత:—నోరు ముయ్యవలసిన సమయంకాదు నాన్న ఇది నా జీవన్మరణసమస్య.

కుటుం:—ఏది ఏమైనప్పటికి నీవుఅంగీకరించాలి.

శాంత:—అంగీకరించలేను నాన్నగారు, క్షమించండి.

రంగ.— (వస్తూనే) ఎందుకంగీకరిస్తుంది మామయ్యా నే చెప్ప లేదూ. ఆమె మనస్సంతా ఆ సంగీతం......

కుటుం:—ఛీ! పోవెధవా! మంచి చెడ్డాలేకుండా ప్రవర్తిస్తున్నావ్

రంగ:— నాకెందుకొచ్చిందిలే. హాయిగా నిద్రపోక అనవసరంగా యిటొచ్చాను. (వెళ్తాడు)

శాంత:— అవునునాన్నా బావ చెప్పిందాట్లో అబద్ధం ఏమాత్రం లేదు.

కుటుం:-శాంతా! ఏమంటున్నావ్ ఆ దరిద్రుణ్ణా.

శాంత:-అవును.

కుటుం:-అంతా నీయిష్టమే నన్నమాట మనం యిచ్చేజీతపు రాళ్ళమీద ఆధారపడిన ఆనిర్భాగ్యుణ్ణి నీవు పెళ్ళాడటమా? అయినా వాడేకులంవాడని నీకింత విషం నూరి పోసింది వాడేనన్నమాట ఎంతమంచిగా పైకి కనిపిస్తాడు. వెధవ.

శాంత:- నాన్నా! ఇందులో అతని తప్పేమీలేదు. మిమ్మల్ని ఒప్పించి మీ అంగీకారంతోనే అతన్ని వివాహం చేసుకుంటానని వాగ్దానం చేసాను

కుటుం:-వాగ్దానం చేసావ్! నీ రక్షణభారం వహించిన నీ కన్న తండ్రి చనిపోయాడనుకున్నావా? ఏమనుకొని ఈదారుణానికి తలపెట్టావ్.

శాంత:-నాన్నా అనవసరంగా శ్రమపడుతున్నారు. అతన్ని తప్ప వేరొకరిని వివాహం చేసుకోలేను, క్షమించండి (శాంత వెళ్తుంది)

కుటుం:-కాలం ఎంతలో ఎలా మారిపోయింది. తల్లి తండ్రుల మాట పిల్లలు వినేరోజులు పోయాయి. పిల్లలమాటలు తల్లి తండ్రులు వినాలి...లేకపోతే (ఆలోచిస్తూ అటు యిటూ తిరుగుతావుంటాడు భాస్కరం వస్తాడు.)

భాస్క:-నమస్కారమండి.

కుటుం:-(వికటంగా) బాబు...వచ్చావా... నేనూ అనుకుంటూనేవున్నా నీవు వచ్చేటైం అయిందని రా...రా యిలాకూర్చో ... ఆ! ఎందరిళ్లల్లో పాఠాలు చెప్తున్నావ్?

భాస్క:- ఇరుట్యూషన్లున్నాయండి.

కుటుం:- బాగా అందరికి నీపాఠాలు చెప్పుతున్నావా!

భాస్క:- నాపొరపాటు ఏమీలేకుండా జాగ్రత్తగానే చెప్తున్నా

కుటుం:- అదే, అదే, నేనూ అడుగుతున్నాను ... మరి ... అందరూ అమ్మాయిలేనా.

భాస్క:- యిద్దరు కుర్రవాళ్లుకూడా వున్నారు.

కుటుం:- అయ్యో పాపం వాళ్ళుకూడా ఆడపిల్లలయితే ఎంత బాగుండేది!

భాస్క:- ఏమిటండి, ఈవేళ మీధోరణి చాలా విచిత్రంగావుంది

కుటుం:- మరి విచిత్రంగావుండదునాయనా. నీలాంటి పెద్ద మనుష్యులను సంగీతమాష్టర్లుగా నియమించడమే మాబుద్ధి తక్కువ.

భాస్క:- (లేచినిల్చొని) అంత అవమానం నావల్ల మీకేం కలిగింది.

కుటుం:- ఇంతకన్నా అవమానం ఏంకావాలి! పెండ్లికాని పిల్లను నీ మాయమాటల్తో మోసగించి మాకు గాకుండా చెయ్యాలన్న ప్రయత్నమే.

భాస్క:- పొరబడుతున్నారు. మోసగించాల్సినఅవుసరం నాకేం లేదు. అయినా మీ అమ్మాయిని మీకుగాకుండా చెయ్యడమేమిటి?

కుటుం:- ఏమీ తెలియనట్లు నటిస్తున్నావే. ప్రేమ పెండ్లి ఆదర్శం అంటూ కల్లి బొల్లిమాటలునేర్పి దాని మనసు విరచి.

భాస్క:- కుటుంబరావుగారు! దయయుంచి నేను చెప్పేదికూడా వినాలి.

కుటుం:-తమరేమీ చెప్పక్కర్లేదు. (పర్సులోనుంచి డబ్బుతీసి) ఇదిగో నీజీతం (మొఖంమీద కొట్టాడు) అట్టే అరవకే బయటకుపో.

భాస్క:-కాస్త మర్యాదగా ప్రవర్తించండి. ఎంతడబ్బు గల వాళ్లయినా యిలా గర్వపడి.

కుటుం:-ఏమిట్రా అన్నావ్? (చెంపమీదకొట్టాడు)

శాంత: (వస్తూనే) నాన్నా! (భాస్కరానికిఅడ్డుపడుతూ) నాన్నా ఏమిటీ దౌర్జన్యం ... (దుఃఖంతో) మాష్టరుగారూ!

భాస్క:-(చెంప తడుముకుంటూ చిన్న చిరునవ్వుతో) వస్తాను శాంతా.

రంగ:- (వస్తూనే) ఛీ మైన పనిచేసావ్ మావయ్యా.

కుటుం:-నోర్మూయ్! (కోపంగా లోపలికి వెళతాడు. నోరుమూసు కొని సంతోషంతో వెంట రంగడు వెళ్తాడు శాంత విచా రంగా కూర్చుంటుంది)

— పా ట —

శాంతిలేని, కాంతిలేని
నిరాశ బ్రతుకాయెగా ॥శాం॥
చీకటి, పెనుతుఫానులో
చీలిపోవునో మాబాటా
చెదరి పీడిపోవునో మాజంట ॥శాం॥
కుల మతాల కుతిలత్వములో
కూలిపోవునో, ఆశాసౌధం
గ్రుంకిపోవునో ఆశాకిరణం ॥శాం॥

డాక్టరు:-(ప్రవేసిస్తూ)అమ్మాయి శాంతా! నాన్న గారున్నారా?

శాంత:-రా మావయ్యా! కూర్చోండి...నాన్నా! డాక్టరుగారు వచ్చారు (అని లోనికిపోతుంది. డాక్టరుకూర్చుంటాడు. రంగడు ఆదుర్దాగా వెనక్కు చూసుకుంటూ వస్తాడు)

రంగ:- ఇవ్వాళతో జలుబువదిలి పోయింది.

డాక్ట:-(పరీక్షగాచూస్తూ) ఎవరికి?

రంగ:- (హఠాత్తుగాచూచి) ఆఁ! ఆఁ! ఏమీలేదండి.

డాక్ట:- ఓ... మీరు యిక్కడ వున్నారేమిటి?

రంగ:- డాక్టరుగారు! మీరా? మీ కాళ్లకు దణ్ణంపెడతా. మా మామయ్యకు మాత్రం చెప్పకండి.

డాక్ట:- ఏమిటీ! కుటుంబరావుగారు మీ మామయ్యా!

రంగ:- అవునండి ఆరోగంసంగతి చెప్పకండి. మామయ్య నా మొఖం చూడడు... . ఆయన...దయవుంచి ఆయన ...వస్తున్నారు... చెప్పకండి.

డాక్ట:-(భారంగా) ఊఁ ... సరె (కుటుంబరావు వస్తాడు)

కుటుం:-డాక్టరుగారు మీకు చాలా శ్రమయిచ్చామండి మా వాడికి తలనొప్పి; జ్వరం వచ్చిందంటే కబురుచేసాను యిప్పుడు పోయిందంటున్నాడు.

డాక్ట:-పోనీలెండి. మీకేమంచిదిగా, ఫీజు తగ్గుతుంది.

కుటుం:-ఏమిటో అనుకుంటాం గాని ఏఖర్చూ తప్పటంలేదు.

డాక్ట:- యీ ఖర్చుకేంగాని, అమ్మాయి వివాహానికుంటుంది ఆఖర్చు తట్టుకోవాలి. ఇంతకూ సంబంధాలేమైనాచూసారా?

కుటుం:-అదేమిటండీ! నిక్షేపంలా మా మేనల్లుడు రంగడు వుంటే (రంగణ్ణి చూపిస్తాడు. రంగడు సిగ్గు నభిన యిస్తూ వెళ్తాడు.)

డాక్టర్:- ఏమిటీ, మీఅమ్మాయిని ఈతనికిచ్చి వివాహంచేస్తారా? అసలు మీఅమ్మాయికి ఇష్టమేనా?

కుటుం:-యిష్టమున్నా లేకపోయినా తప్పదండి. మేనరికం, వీళ్ల చిన్నతనంలోనే మాటలు జరిగిపోయాయి.

డాక్టర్:-కుటుంబరావుగారు! మీరేమైనా చెప్పండి నేనువున్నది వున్నట్లు మొఖాన్న అనేయటం నాతత్వం. ఈతనికి మీ అమ్మాయినిస్తే సుఖపడదని గ్రహించండి.

కుటుం:-కారణం?

డాక్టర్:- (టైంచూసుకొని) మీకు తర్వాత చెప్తా వెంటనే వెళ్లాలి ఆపరేషన్ కేసొకటి వున్నది వస్తానండి, (వెళ్తాడు.)

కుటుం:-(ఆశ్చర్యంగా చూస్తూవుంటాడు.)

[తెర]

# వాగ్దానం

## 5వ రంగం

(అర్ధరాత్రి అదిబకరోడ్డు. కారు హారన్లు మాత్రమే వినబడుతూవుంటాయి. క్యాంపునుంచి తిరిగివస్తున్న ప్రకాశం కారు ఆపుచేసి డ్రైవరును ఎదురుగా వస్తున్న లారీలను ఆపమని పంపిస్తాడు.)

డ్రైవ:- ఏయ్! యింగే లారి నిలుపు.

వ్యక్తి:- (లోపలనుంచి ఒకవ్యక్తి) ఎందుకూ?

డ్రైవ:-ఆఫీసరు చెక్కింగ్ దా చేస్తురు.

వ్యక్తి:-లారీలు బయలుదేరేముందే చెకింగ్ చేసారు ఆపనవసరం లేదని షావుకారుగారు ముందేచెప్పారు

డ్రైవ:-అదియెల్లా ముడియాదు మొదలు ఫర్మిట్ దా చూపు

వ్యక్తి:-అది షావుకారిగారివద్ద వుంది.

డ్రైవ:-(లారీదగ్గరకు వెళ్తాడు) పర్మిట్ యిల్లేయన్నా యిక్కడనుంచిపోముడియాదు. అయ్యా సొల్లు రాంగులు అద్దాయిను.

వ్యక్తి:-ఆయన నిద్రలోవున్నారు. లేపితే కోపంవస్తుంది.

డ్రైవ:-కోపం గీపం ముడియాదు. యేరయ్యా ఆ సావుకారి.

వ్యక్తి:-సుబ్బయ్యగారు, ఆయనఅలాంటి వ్యాపారస్థుడు కాదని నీకు తెలుసుగా.

డ్రైవ:-అదియెల్లా ఇనక్కు తెరియాదు. శీఘ్రం షావుకారుదా పూడుసుకు రావయ్యా.

వ్యక్తి:-చివరలారీలో పడుకొని వున్నారు పిలుస్తా.

డ్రైవ:-శీఘ్రమే వాంగో.

ప్రకా:-[ప్రవేశం] డ్రైవర్ ఎన్నిలారీలో చూడు. వీడికి ఈ అర్థ
రాత్రివేళే అదను చిక్కినట్లుంది.

డ్రైవ:-అయిమలారీ సార్.

ప్రకా:-సరె నీవుకూడాపోయి ఆ పావుకారుని పిలుచుకురా.
(సుబ్బయ్యగారు వస్తారు)

సుబ్బ:-నేనే వస్తున్నానుగా మళ్లీ వాడికా శ్రమెందుకు.

ప్రకా:-ఓ!......మీరేనా.

సుబ్బ:-చిత్తం, నేనేనండి

ప్రకా:-ఏది పర్మిట్టు చూపించండి
(సుబ్బయ్య పర్మిట్టు యిస్తాడు ప్రకాశం చూస్తూ)

ప్రకా:-మరి మిగతా లారీలకు?

సుబ్బ:-అవి నావికావండి. మాతమ్ముడివి.

ప్రకా:-అయితే ఆ పర్మిట్ఎక్కడ?

సుబ్బ:-ఆయనదగ్గరే వుంది.

ప్రకా:-ఆయన్ని పిలవయ్యా

సుబ్బ:-చిత్తం వెనుకవచ్చే లారీలో వస్తున్నాడండి.

ప్రకా:-ఎందుకయ్యా యిన్ని అబద్ధాలు.

సుబ్బ:-చిత్తం.

ప్రకా:-ఏమిటి చిత్తం.

సుబ్బ:-అలా ఆగ్రహిస్తే నేనేం చెప్పేదండి. ఇదివరలో తమకు
మనవిచేసా.

ప్రకా:-ఏమని? ఇలా దొంగతనంగా బస్తాలను ఎగుమతి చేస్తా
వనా?

సుబ్బ:-చిత్తం అలా అనకండి. ఎల్లప్పుడు మా వ్యాపారాలు యిలాగ జరుగుతవటండీ. ఈ సమయం మళ్లీ ఎప్పుడో గాని దొరకదు. అంతవరకు నష్టంతో అవస్థలుపడాలి కదండి,

ప్రకా:-మీనష్ట కష్టాలు మాకు నివేదించుకొని బాధిస్తారెందుకు. అది ప్రభుత్వాన్నే నేరుగా అడగొచ్చు. అయినా అదంతా నా కనవసరం స్టేషన్‌కు లారీలను నడపించు. డ్రైవర్!

డ్రైవ:-సార్!

సుబ్బ:-చూడండి, మీరు తలచుకుంటే ఎంతైనా చెయ్యగలరు. కాని నామనవి ఒక్కటి మీరువినాలి. ఇదివరకు ఆఫీసరు మామూలు రెండువందలు, పాపం మీరుక్రొత్తగా వచ్చారు. అందుకని ఈ మూడువందలూ మీరు స్వీకరించాలి.

ప్రకా:-షావుకారుగారు ఇలా ఎప్పుడూ మాట్లాడకండి ఈ ఒక్కసారి మర్యాదగా హెచ్చరిక చేస్తున్నాను.

సుబ్బ:-చాలాసంతోషం, తమరు మాట్లాడినట్లే ప్రతి ఆఫీసరు మాట్లాడితే దేశం ఎంత బాగుపడేది. అప్పుడు మీరన్నట్లు దొంగ వ్యాపారస్థులూ వుండరు. లంచకొండి ఉద్యోగస్థులూ వుండరు. అయినా ఇంకా నాదొక్కటే మనవి. మీకు మూడువందలంటే చిన్నచూపుగా చూస్తున్నారని తోస్తుంది. పోనీ దానికి డబుల్ అంటే ఆరువందలు చెల్లించుకొంటూ, ఈసారి కిది ఇలా పోనీయండి.

ప్రకా:-అలా వీల్లేదు. (కోపంతో)

సుబ్బ:-పోనీ మీరేచెప్పండి ఎంతకావాలో!

ప్రకా:-నేనేమైన లంచగొట్టు ననుకున్నావా! పిచ్చి పిచ్చిగా మాట్లాడక లారీలను స్టేషనుకు నడిపించు. అలా చూస్తావేం. డ్రైవర్ ?

డ్రైవః-సార్.

ప్రకా:-లారీలను వెనక్కి త్రిప్పమను.

డ్రైవః-అమాసార్.

సుబ్బ:-తొందరపడకండి ఆఫీసరుగారు. డ్రైవర్! కాస్త నిదానించు. ఆఫీసరుగారూ! ఆఖరిమాట ఎనిమిదినందలు... (ప్రకాశం మాట్లాడబోతాడు) పోనీ వెయ్యి సరేనా.

ప్రకా:-వెయ్యికాదు లక్షరూపాయిలిచ్చినా వదులుతా ననుకున్నావా! నీలాంటి ప్రజాపీడకులను......

సుబ్బ:-ఆఫీసరుగారు! మర్యాదగా మాట్లాడండి. పెద్దమనిషిగా ఇంతవరకు చెప్పాను. ఇక...... మీరే వూహించుకోండి ఉ! ...ఈడబ్బుతీసుకొని తమరు దయచెయ్యండి (వెయ్యిరూపాయలసంచి తీసి చూపిస్తాడు)

ప్రకా:-నోర్మూయ్ ?

సుబ్బ:-ఆఁ! నోర్మూయ్యాలేం అలాగేలే చూడుబాబు చివరిమాట మీ ప్రాణాలమీద ఆశ, జీవితం మీద ఆశక్తి వుంటే ఈడబ్బు తీసుకొని వెళ్లండి లేదా?

ప్రకా:-ఈ దడిపింపులు నాదగ్గరకాదు. [పిస్టల్ తీస్తాడు సుబ్బయ్య అడ్డుగా వెళ్లబోతాడు) ఆగు! ఒక్క-అడుగు ముందుకువేశావా! (సుబ్బయ్య ప్రక్క-కుతప్పుకుంటాడు ప్రకాశం లారీలదగ్గరకువెళ్లి) వెనక్కి త్రిప్పండి. ఊ

తొందరగా (డ్రైవరు వెళ్ళబోతాడు, సుబ్బయ్య అతని చెయ్యిపట్టుకొని లోపలికి సైగచేస్తాడు.)

సుబ్బ:-యల్లయ్యా! వెంకయ్యా! మల్లన్నా! యీరిగా! ఊఁ కానీయండి. (ఫీస్టల్ సౌండు కర్రదెబ్బలు వినిపిస్తాయి ప్రకాశం అబ్బా!... అని గావుకేక వేయును) వీడి చట్టాలు, కోర్టులు, న్యాయాలు, తీర్పులు, శిక్షలు అన్నీ ఆలోకంలో చూస్తాడు అరేయ్ మణ్ణుగం ఈ డబ్బు నువ్వుతీసుకో ఇది తినేప్రాప్తి వాడికి లేదు. ఊఁ తీసుకో అలా వణుకుతావేం!

మణ్ణు:-(ఆశగా) వొండు మిల్లేసార్. (తీసుకుంటాడు.)

సుబ్బ:-అరేయ్, నీవువెంటనే వూళ్ళోకిపోయి ఆఫీసర్ను దొంగలు కొట్టిపడేసారని ప్రచారంచెయ్యి! నీకొచ్చే ఆపదను ఆదుకోడానికి నేనున్నానురా! చచ్చాడు పీనుగ. ఈరోజుతో పీడావదలి పోయింది. రేపు పత్రికలో దొంగలుపడి కొట్టినట్లు ఒకప్రకటన పారేస్తేసరి. ఊఁ! పోరా మణ్ణుగం... (డ్రైవర్ పరుగెత్తాడు) లారీలను పోనీయండిగా. ఇంక ఎవడావుతాడో చూస్తాను.

(సుబ్బయ్య వెళతాడు)

తెర

# వాగ్దానం

## 6వ రంగం

సమయం సాయంత్రం 4 గంటలు.

కుటుంబరావుగారి భవనంలో

కుటుంబరావుగారు పడకకుర్చీలో నీరసంగా కూర్చునివుంటాడు. మధ్యమధ్య దగ్గు పొరలు పొరలుగా వస్తుంది. రామయ్య ఆలోచనతో అటు యిటు పచార్లుచేస్తూ వుంటాడు. గోడనున్న ప్రకాశంఫోటోకు దండవేసి వుంటుంది. శాంత హారతియిస్తూవుంటుంది, కన్నీళ్లపర్యంతం దుఃఖంతో మునిగివుంటుంది. హఠాత్తుగా పళ్ళెంపడిపోతుంది. అన్నయ్యా! అని శాంత పెద్దకేకవేస్తుంది. రామయ్యదగ్గరకువచ్చి తలనిమురుతాడు. ఏడ్పుతో శాంత లోపలికివెళ్తుంది.

రామ:-(మళ్లీ పచార్లుచేస్తూ) బావా! అలా విచారిస్తూ కూర్చుంటే పోయినవాడు వస్తాడా? ఈ మూడు నెలల నుంచి అలా ఏడుస్తూ కూర్చున్నావ్ నీ కొడుకు నేమైనా తేగల్గావా! మనం నిమిత్తమాత్రులం అయిందేదో అయిపోయింది. వాడికి అంతవరకే ఆయుర్దాయం వుంది. మనం మాత్రం ఏంచేస్తాం.

కుటుం:-అదికాదు రామయ్యా బావా! వాడి పట్టుదల ఆనీతి ఆ తెలివితేటలు మరుపు రాకుండావున్నాయ్. (దగ్గు)

రామ:-అదిగో మళ్ళా పిచ్చిలో పడుతున్నావ్. బ్రతకనిబిడ్డ బారెడూ అని ఎన్నిలక్షణాలు వుంటేమటుకు మన బిడ్డకానప్పుడు మనం ఏంచేస్తాం చెప్పు. నీవేయిలా దిగులుగా కూర్చుంటే వున్నఆరోగ్యం కాస్త వూడి పోతుంది.

కుటుం:-ఆరోగ్యంగా బ్రతికివుంటే నేను మాత్రం చేసేదేముంది.

రామ:- అన్నీ తెలిసిన నీవే ఇలాఅంటే ఆపిల్లలస్థితి ఎవరు చూస్తారు. వాళ్ళను దిగులు పడనీయకుండా ధైర్యం చెప్పాలిసిన నీవే ఇలా దిగజారితే ఎలా చెప్పు. పిల్లల్ని యినా దృష్టిలో పెట్టుకొని ధైర్యముతో వుండటానికి ప్రయత్నంచెయ్యి.

కుటుం:-...ఊ..ఁ! (కొంతసేపు నిశ్శబ్దం)

రామ:-ఆమూడు ముళ్ళూ శాస్త్రముడివేస్తే మనం ఒక మూల కూర్చోవచ్చు.

కుటుం:-యిప్పుడు తొందరేముంది.

రామ:-ఈ నెలదాటితే మళ్ళా సంవత్సరంవరకు ముహూర్తాలేలేవు.

కుటుం:- ప్రకాశం పోయి మూడు నెలలయింది. యింతతొం దరలోపెళ్లిప్రయత్నాలుచేస్తే ఏంబాగుంటుంది.

రామ:-ఆమాటానిజమే కానీఏంజేస్తాం. తప్పదుకనుక చెయ్యాల్సొస్తుంది. అయినా పెద్దమనిషైవున్న పిల్లను ఎంతకాలం యింట్లోపెట్టుకొని అలావుంచుతారు. పదిమందిపెద్దలూ పోరుపెట్టకముందే పెండ్లిచేస్తేబాగుంటుంది. ఒకరికిచెప్ప వలసినవారమేకాని ఒకళ్ళచేత చెప్పించుకోవలసినవారం కాదుగదా!

కుటుం:-[దగ్గుతూ ఆవేశంతో] ఊ..మీయిష్టం. ఎలావీలుగా వుంటే అలానేచెయ్యండి

రామ:-అలా బజారుపోయివద్దాం

కుటుం:-నేనెందుకులేబావా

రామ:- ఒంటరిగా కూర్చుంటే నీకుమాత్రం ఏం తోస్తుంది. పురో హితునితో మాట్లాడివద్దాం (కుటుంబరావు, రామయ్య బయటకు వెళ్తారు. లచ్చి బయటనుంచివస్తుంది)

లచ్చి:- శాంతమ్మగారు!

శాంత:- (లోపలనుంచి) వస్తున్నా! (వస్తుంది)

లచ్చి:- చాలాచిక్కి పోయారమ్మా. ఉత్తరంయిచ్చాను. జవాబు రాసిచ్చారు. (లచ్చివుత్తరంయిస్తుంది. శాంతచదువు తుంది)

శాంతా!

నీ వుత్తరంచదివి అర్థంచేసుకున్నాను. కాని పరిస్థితు లనుబట్టిచూస్తే ఏవైపునా ఆశాకిరణం కన్పించుటలేదు. మనభవిష్యత్తును ఉజ్వలభవిష్యత్తుగా మార్చివేస్తానన్న ఆదర్శమూర్తి ప్రకాశం మనలనువీడిపోయాడు. ఎన్నో అంతులేని ఆలోచనలతో ఆశాసౌధాలను నిర్మించి, ఆ సౌధాల్లో హాయిగా విహారంచేయాలనుకున్నాం... కాని ... ఇక ఎలాంటి అవకాశాలు లేవు. నీప్రేమకు నీవుచూపిన ఆదరణకు కృతజ్ఞుణ్ణి. కాని కాలంమనలను వేరుచేసింది. పోని ఎదురుతిరిగి ఎక్కైనాపారిపోదామంటే మనలను కళంకిత చరిత్రులుగాచిత్రించి వెంటాడుతుందీ సమాజం. ఇదిగమనించి మీనాన్నగారిమాట నిలబెట్టు నన్ను మరచిపోటానికి ప్రయత్నించు.

శెలవ్,

నీ శ్రేయోభిలాషి,

భాస్కరం

శాంత:-వీల్లేదు. అలాజరగటానికివీల్లేదు. లచ్చీ!

లచ్చి:- అమ్మా. కంగారుపడకండి. ధైర్యంతో వుండడీ

శాంత:-లచ్చీ! అన్నయ్యాజూస్తే అలాఅయ్యాడు. నాన్నగారు చూస్తే నామాటేనేగ్గాలంటాడు. ప్రేమించినభాస్కరాన్ని జూస్తే మరచిపోవటానికి ప్రయత్నించమంటాడు. ఇంకా దేన్నిచూసి ధైర్యంగావుండనులచ్చి. లచ్చీ!నాన్నగారు బజారువెళ్లారు. ఎవరూలేరనిచెప్పి మాష్టరుగార్ని రమ్మనమని, ఆఖరికోర్కెగా నాప్రార్థన ఆలకించమను. వెళ్లుతొందరగా వెళ్లు. (లచ్చివెళ్తుంది. శాంతపాటపాడుతుంది.)

— పాట —

ఆశా...
నిరాశా...
ఆశా,...నిరాశాయే
ఆశించిన అమృతంబు
హాలాహాల మౌతున్నది
తలపెట్టిన అభ్యున్నతి
కలయే ఐపోతున్నది ॥ఆ॥
న్యాయానికి, ధర్మానికి
సాయమే కరువైనది
శూన్యహృదయపు
సుడిగుండాన
చిక్కిపోవలసినదేనా ॥ఆ॥

డాక్టరు:-(ప్రవేశిస్తూ) అమ్మాయి. నాన్నగారున్నారా?

శాంత:- లేరండీ బజారు వెళ్లారు

డాక్టరు:- ఏమమ్మా అలావున్నావేం

శాంత:- ఏమీలేదండి

డాక్టరు:- నాదగ్గర దాపరికమెందుకమ్మా

శాంత:- డాక్టరుగారు! నాతండ్రితరువాత తండ్రంతటివారు చిన్నప్పట్నుంచి నామంచీచెడ్డా మీరేచూస్తూవస్తున్నారు నాకిష్టంలేని పెండ్లి నాన్న నాకుచేయబోతున్నారు

డాక్టరు:- విన్నానమ్మా. అంతావిన్నాను. ఆ అప్రయోజకుడికిస్తే అమ్మాయిజీవితం అంధకారమౌతుందని ఆనాడే మీనాన్నగార్కి చెప్పాను.

శాంత:- ఈ పెండ్లి జరగకపోతే సర్వనాశనం అయిపోతామని హెచ్చరించారు. ఏంచెయ్యమంటారో మీరేచెప్పండి. అన్నయ్యేవుంటే ఇలాంటిఅవస్త నాకొచ్చేదికాదు (కళ్లనీళ్ళుతుడుచుకుంటుంది)

డాక్టరు:- అమ్మాయి విచారించకు. భాస్కరాన్ని, నిన్నూగురించి పాపం...ప్రకాశం...అన్నివిషయాలు చెప్పాడు. ఆనాడు మీఅత్తయ్యకూడా ఎంతోసంతోషించింది. సంస్కరణ వివాహంఅంటె ఆమెకెంతో అభిలాష (భాస్కరం వస్తాడు)

భాస్క:- నమస్కారం డాక్టరుగారు

డాక్టరు:- (తలవూపి) కూర్చోవోయ్ (కూర్చుంటాడుభాస్కరం) మీలాంటి ఆదర్శదాంపత్యాన్ని అభినందించి ఆనందించేవాళ్లు ఆచరించి, హర్షించేవాళ్లు మనదేశంలో బహుస్వల్పం మీవలె ముందడుగువేసే యువతీయువకులు నేటి

కలుషితసమాజానికి యెంతో అవుసరం. అందుకుమీరు అభివందనీయులు

భాస్క:-[ఆనందంతో] డాక్టరుగారూ!

శాంత:-(ఆనందంతో) డాక్టరుగారు!

డాక్టరు: (యిద్దరిని చేరివక (ప్రక్క-వుంచుకొని) మీకిద్దరికి ఇవే ఆస్సీశులు. ఎన్నికష్టనష్టాలువచ్చినా ఒకరికొకరు సహా యంచేసుకుంటూ ఆదర్శ దంపతులు గా వర్థిల్లండి. ఎలాగైనా మీనాన్నగార్ని ఒప్పించి మీపెండ్లికితగినఏర్పాట్లు చేస్తాను అంతవరకు ఎక్కడైనా తలదాచుకొండి.

భాస్క:-అలాగేనండి

డాక్టరు:- మరినేనువెళ్తా. ఆ, అన్నట్లుమరిచాను. ముందుగా రిజిష్టర్డ్ మేరేజిమాత్రం చేసుకొండి ఎందుకన్నా మంచిది. వెంటనే వుత్తరంద్వారా ఏసంగతి తెలియపర్చండి. ఇక వస్తా (డాక్టరు వెళతాడు)

భాస్క:-శాంతా! మావగారు వచ్చేటైమయినట్లుంది. వస్తా

శాంత:-ఎంత ధైర్యశాలురండి వ స్తేయేం.

భాస్క:-ఈ చెంపకూడా...

శాంత:-వాచిపోతుందని భయమా మరేం పర్వాలేదు.

భాస్క:-ఆఁ అలానేం... శ్రీమతిగారు ట్రైను టైం అయింది ఒక్క గంటలో స్టేషనుకు జాగ్రత్తగా రావాలి.

శాంత:-చిత్తం [భాస్కరం నవ్వుతూవెళ్తాడు.]

— పాట —

ఆనందసుధా మధుగీతి
ఆలాపించగా, ఆలోచనేలా ||ఆ||

నిరాశలన్నీ నిర్మూలంబాయె
ఆశాకిరణము అగుపించె ॥ఆ॥

హృదయసీమలో దావాగ్ని
ఆరిపోయే జీవన్‌జ్యోతివెలిగే ॥ఆ॥
విశాలహృదయులు ఒకరున్నా
ఆపదలన్నీ తొలగిపోవుగా ॥ఆ॥

(యిటు శాంత లోపలికి వెళ్తుంది ఇంతలో కొండడు వస్తాడు గుర్తించలేనంత ముస్తాబుగా వస్తాడు చేతిలో ఒక పొట్లాం వుంటుంది.)

కొండ:–బాబుగారూ!...బాబుగారు! (లచ్చివస్తుంది)
లచ్చి: ఎవరూ? ...
కొండ:–నేనేనే బాబుగారు లేరేటి?
లచ్చి:–ఏంటి మా వుషారుగావున్నావ్.
కొండ:–వుండవే నీకో మంచిమాట చెవినేద్దామనొచ్చాం.
లచ్చి:–ఏంటది ?
కొండ:–అన్నన్నా ... చెప్పనిత్తేనా.
లచ్చి:–తొందరగా చెప్పు నాకుపనుంది.
కొండ:–నీతల్లి సిగ్గొయ్యా నాకంటె నీకేంపని వుంటుంద్దే
లచ్చి:– లేదులేమావా! చెప్పు
కొండ:–అదేనే అప్పుడే మర్చిపోనావా?
లచ్చి:–ఏంటో నాకర్థం కావటంలేదు.
కొండ;–తస్సదియ్యా మానాజూగ్గ మాటాడేతున్నావే వంతు లమ్మలాగా.
లచ్చి;–పోమావా నీవన్నీ పాడుమాటలు.

కొండ:—లచ్చీ! మునుపటి కొండడనుకుంటున్నావో యేటో అంతా మారిపోనాది. (తాగుడు మానేసానే . . .

లచ్చి:—ఆఁ!

కొండ:—మానేసి . . . ఆడబ్బులతో గలానుకోపంచి బనీను, సిలుకు చేతిరుమాలు కొనేశాను. యింట్లో యూడ సూసినా సామాను కొనిపారేసానే. నిన్ను తలకిందుల చేసేద్దామని యిన్నిరోజులు చెప్పకుండా లటుక్కున చెప్పేసానే

లచ్చి:— మామంచిపనిచేసావ్ మావా అయితే మరినాకేటి తెచ్చావ్!

కొండ:—ఇన్నిరోజులు ఏడిపించినావుగందా మరి నాకేటిత్తావ్?

లచ్చి:—పోమావా! నీయన్నీ యదవమాటలే నీచేతిలోదిఏంటి.

కొండ;—సెప్పుకోసూద్దాం.

లచ్చి:—చీర.

కొండ:—ఓసి యారీ (యిద్దరూ నవ్వుకుంటారు. చీరచూసి సంతోషపడుతుంది.)

లచ్చి:—మావా! యింటికొచ్చెయ్య మంటావా?

కొండ:—తప్పేదియ్యా! ఇంకా కూకుందామనుకున్నావ్. తీసుకు పోటానికే వచ్చేనే.

లచ్చి:—వస్తానుగానిమావా, మరిపదిరోజులుపోతే నాజీతంకూడా ఇస్తారుగా నెలకూడా అవుతుంది.

కొండ:—మంచాలోచనే లేయే, రాత్రిళ్లు వచ్చెయి, అన్నం ఆ ముసలి చంద్రివండిపెట్టుద్దిలే ఏటంతావ్.

లచ్చి:—ఇంకేటంతాను. (అని నవ్వుతుంది.)

కొండ:-ఇక నేపోతా చూడులచ్చి, రాత్రికొచ్చేటప్పుడు చూరాకు ఆకోక కట్టుకొనిరా ఏటి.

లచ్చి:-(కులుకుతూ) అలాగేలే మావా

కొండ:-మరొత్తా (వెళ్లబోతాడు రాము వస్తాడు.)

రాము:-ఏం కొండయ్యా! పూలకంగడులా తయారయ్యావ్.

కొండ:-చిత్తం! మాయింటిదాన్ని చూచి పోదామనొచ్చా

రాము:-మరి చూచావా!

కొండ:-చిత్తం!

రాము:-ఏమిటి నీ మొఖం చిత్తం?

కొండ:-చిత్తం!... చిత్తం!... చిత్తం చూచానండి బాగాళొ వుంది బంగారపు బొమ్మలాగా.

రాము:-అయితే ముక్కలు ముక్కలుగా కోసేయ్.

లచ్చి:-అయ్యొబాబోయ్

కొండ:-ఎందుకు బాబయ్యా

రాము:-ఒకొక్కముక్క అమ్ముకుంటే కావలసినంత డబ్బు నీవూ ఒక జమిందారువయిపోవచ్చు

కొండ:-ఓ...అదాచంగతి మాచెడ్డ తెలివిగలవారుబాబయ్యో! (లచ్చి కొండయ్య నవ్వుతారు)

రాము:-నీ మొఖం (అని వెళ్తాడు.)

కొండ:-వత్తానే (కొండయ్య బయటికి లచ్చి లోపలికిపోతారు. శాంతవచ్చి కుర్చీలోకూర్చుని పేపరు చదువుతూ వుంటుంది కుటుంబరావుగారు వస్తారు.)

కుటుం:-అమ్మాయి.

శాంత:-నాన్నా!

కుటుం;-లగ్నం నిశ్చయించాం ఇంకా పదిరోజులు మాత్రమే టైం వుంది. చేయవలసిన ఏర్పాట్లు చాలా వున్నాయి.

శాంత:-(పేపరు మొఖానికి అడ్డం పెట్టుకుంటుంది)

కుటుం:-నాముందు సిగ్గేమిటి పిచ్చితల్లీ (చిన్న చిరునవ్వుతో లోపలికి వెళ్తాడు. శాంత ముఖానికి అడ్డుగావున్న పేపరుతీసి భారంగా నిట్టూర్పు విడుస్తుంది. రామయ్య గారు వస్తారు.)

రామ:-(శాంతముఖాన్నిచూసి) అమ్మాయి అలావున్నావేం?

శాంత:-ఏమీలేదండి......

రామ:-అదేమిటమ్మా అలా గాబరాపడతావేం. వంట్లో కులాసాగా లేదా?

శాంత:-నాకేం బాగానేవున్నాను.

రామ:-లేదమ్మా నీమనసులో ఏదో బాధవుండివుంటుంది చెప్పలేకపోతున్నావ్ చెప్పమ్మా నీకొచ్చిన కష్టంఏమిటి? నగలు నాణ్యాలు లేవనేదిగులా? (జేబులోనుంచి ఒక రసీదు తీసి) ఇదిగో! ఇప్పుడే నెక్ లేస్ కు ఆర్డరిచ్చాను. ఇంకా ఏమైనా కావాలంటె చెప్పమ్మా.

శాంత:-ఇంకేమీ అక్కర్లేదండి కాస్త తలనొప్పిగావుంది. (లోనికి వెళ్తుంది.)

రామ:-(లోనికి వెళ్తున్న శాంతను చూస్తూ తన ధోరణిలో) ఆ... శుభలేఖలకు ఆర్డరిచ్చాను. ఇంకా ఏంచెయ్యాలి ఆ...ఆ! మంగళసూత్రాలు (లోపల హఠాత్తుగా పెద్ద శబ్దం వినబడుతుంది. నాన్నా, నాన్నా అని అరుపులు వినబడతయి. రామయ్య కంగారుగా పరుగెత్తాడు

ఒకప్రక్క రామయ్య మరొప్రక్క శాంత అధారంతో కుటుంబరావును తీసుకువస్తారు. వెంట రాము వస్తాడు.)

శాంత:-రామూ తొందరగా డాక్టర్ని పిలుచుకురా (రాము వెళతాడు.)

కుటుం:-(చాలా నీరసంతో) అబ్బా! హుఁ!

రామ:-ఏం బావా! ఇంతలో యిలాజరిగింది.

కుటుం:-ఏంలేదు...కాస్త...కళ్లుదిరిగి (పడకకుర్చీలో పడుకో బెడతారు.)

రామ:-నేను చెప్పలేదూ. ఆరోగ్యం కాపాడుకోమని, నీవేమో మాట వినిపించుకోవాయె, నిద్రాహారాలులేక ఆఖరికి ఇలాంటి అవస్థపట్టింది (రాము వెళ్తాడు. శాంతలోని కెళ్తుంది)

కుటుం:- (దగ్గుతాడు) ఈదగ్గు నన్ను చంపేలావుంది...అబ్బా ఇలాకూర్చో. (రామయ్య ప్రక్కకుర్చీమీద కూర్చుంటాడు) బావా నాకేమో భయంగావుంది. గుండె విపరీతంగా కొట్టుకుంటున్నది. ఈగుండెజబ్బు ఇవ్వాల్టిది కాదు. ఎప్పుడో హఠాత్తుగా ఆగిపోతుంది. ఆబిడ్డల్ని రక్షించేభారం నీది, నీకివ్వవలసిన అప్పుక్రింద...

రామ:-నీకేమన్నా పిచ్చిపట్టిందా? ఇంత పిరికివాడవేమయ్యా! కాస్సేపు విశ్రాంతి తీసుకో అదే సర్దుకుంటుంది. (కుటుంబరావు దగ్గుతూ యుంటాడు డాక్టరు, రామూ వస్తారు. కుటుంబరావును, డాక్టరు పరీక్షిస్తాడు.)

డాక్ట:- మరేమి ఫరవాలేదు . . . (చీటీవ్రాస్తూ) యీ టానిక్ తీసుకురా రాము (రామూ వెళతాడు)

కుటుం:-రామయ్యబావా! భోజనానికి వేళ అయిందిలే.

రామ:—నాకీపూట ఏమీ సహించడంలేదు నీవుచూస్తే ఇలా వున్నావు.

డాక్ట:—అదేమిటండి, వేళకు భోజనం చేయకపోతే ఆరోగ్యం పాడవుతుంది.

రామ:—ఏమిటో అనుకొంటూంగాని వేళకు అన్నీ అవుతూ యుటండి. (అంటూనే వెళతాడు)

డాక్ట:—ఎవరండీయన?

కుటుం:—నా మేనల్లుడు రంగనాథం లేడూ, వాడితండ్రి. అమ్మాయి పెండ్లి విషయము మాట్లాడ్డానికి వచ్చాడు.

డాక్ట:—ఓం అమ్మాయికి కాబోయే మామగారన్నమాట సరి. సరి. అలా చెప్పండి అయితే మీ అమ్మాయిని మీ మేనల్లునికే యివ్వటానికి సిద్ధంగా వున్నారన్నమాట.

కుటుం:—అవునండి. . .

డాక్ట:—కుటుంబరావుగారూ! మీకుధనాన్ని చూచిమీఅమ్మాయి గొంతు కోయబోతున్నారు.

కుటుం:-(తీవ్రంగా) డాక్టరుగారు!

డాక్ట:—ఓ . . . కోపంవచ్చిందా! వున్నది వున్నట్లు మాట్లాడితే ఎవరికైనా కోపంవస్తుందిలెండి, చూడండి, అసలు ఈ పెండ్లి అమ్మాయికిష్టం లేదుకదూ?

కుటుం:—కాని పరిస్థితులనుబట్టి ఈ పెండ్లి చేసుకొని తీరాల్సిందే.

డాక్ట:—పరిస్థితులకు పెండ్లికి సంబంధం ఏముందండి ఆమె భాస్కరాన్ని ప్రేమించింది, పెండ్లి చేసుకోంటాను అని చెబుతూ బాధ్యత మీమీదనే వుంచింది. అందుకు మీరు భిన్నంగా ప్రవర్తిస్తే రాబోయే కల్లోలానికి కారకులు మీరే అవుతారు.

కుటుం:-అంటే!

డాక్టరు:-అంటే. అమ్మాయి ఏ అర్ధరాత్రివేళో అమాంతంగా ఉరి పెట్టుకొని చస్తే అప్పుడు ఈ అల్లునితో ఊరేగింపు చేస్తారా?

కుటుం:-(దుఃఖంతో) డాక్టరుగారు!... అలా అనకండి.

డాక్ట:-ఇలాంటి కేసులు ఎన్నో చూస్తున్నాను. మీకు తెలియదు ఈమధ్యనే ఒక అమ్మాయి విషం త్రాగి మరణించింది కారణం ఏమిటో తెలుసా?

కుటుం:-డాక్టరుగారు! చాలు ... ఇంకేమి చెప్పక్కరలేదు. నాచిట్టితల్లి అటువంటి మూర్ఖురాలు కాదు. నామాట త్రోసేయదని ఇంకా నాకు నమ్మకం వుంది.

డాక్ట:-పోనీ ఒకవేళ మీమాటను త్రోసివేయకుండా మీ ఆశయాన్ని నెరవేరుస్తుందే అనుకొందాము. అప్పుడు మీ అల్లుడుగారు తెచ్చే సుఖరోగాలకైనా ఈమె అహుతి అవ్వకతప్పదు. ఇప్పటికే చాలా శ్రమ ఇచ్చాను, రేపు మళ్ళా కలుసుకొంటూ, బాగా ఆలోచించుకోండి. (వెళ్తాడు. ఏమి చేయాలో అర్థంగాక ఆలోచిస్తూయుంటాడు కుటుంబరావు. లచ్చి లబోదిబోఅంటూ వుత్తరం తెచ్చి ఇస్తుంది.)

కుటుం:-ఏమిటిలచ్చి! (వుత్తరం తీసుకొని చదువుతూ యుంటాడు.)

లచ్చి:- అమ్మగారితో అవసరమొచ్చి పిలిచానండీ దొడ్లోకనిపించలేదు. గదిలోకూడా కనిపించలేదు. టేబుల్ బల్ల మీద ఈవుత్తరం కనిపించిందండి (రామయ్యవస్తాడు.)

లచ్చి:-(రామయ్యగారితో) శాంతమ్మగారు కనిపించలేదండి

కుటుం:-ఎంతపనిచేసేవమ్మా! (గట్టిగా) శాంతా! (నోరుఅలాగే వుండిపోతుంది. అతని అవస్త పట్టించుకోకుండా వుత్తరం తీసుకొని రామయ్య చదువుతాడు.)

రామ:-(వుద్రేకంతో) శాంతికాదు అశాంతి. ఆడదానికి ఇంత ధైర్యమా! దానిఅంతుకనుక్కొంటాను. బావా! పోలీసు స్టేషన్ కివెళ్లి (అంటూవుండగానే లచ్చి బాబుగారు! అని కేకవేస్తుంది రామయ్య నిర్ఘాంతపోతాడు బావా! అని విలపిస్తాడు రామూ వస్తూనే ఈ సంఘటనచూచి నాన్నా! అంటూ ఏడుస్తూ దగ్గరకు వస్తాడు.)

[తెర]

# వాగ్దానం

## 7వ రంగం

సమయం ఉదయం:

(కుటుంబరావుగారి భవనం)

(కుటుంబరావు మంచంమీద పడుకొని వుంటాడు. రంగడు కూర్చొని వుంటాడు. రామయ్య అటు యిటూ పచార్లు చేస్తూ వుంటాడు.)

రంగడు:—అయ్యా నేననుకుంటూనే వున్నాను. అనుకున్నంత పనీ జరిగిపోయింది.

రామ:—ఇప్పుడు జరిగిపోయిందేమీలేదు. ఎక్కడున్నా ఇట్టే పట్టుకొచ్చే ఏర్పాట్లన్నీ చేసాను. ఎక్కడకు పోతారు?

రంగ:—పోయి పదిరోజులయింది ఇంతవరకూ అంతులేదు. ఏమయ్యారో!... ఏం చేస్తుంటారో!

రామ:—తొందరపడితే దొరుకుతార్రా.

రంగ:—దొరికితే మాత్రం లాభం ఏముంటుంది అయిందేదో అయిపోయింది.

రామ:—ఏమిట్రా అయిపోయింది. ఎక్కడున్నా ఎన్ని అవాంతరాలు వచ్చినా అమ్మాయిని తీసుకొచ్చి నీకు పెళ్లి చెయ్యకుండా విడిచిపెడ్తానా?

రంగ:—పెళ్లా ... హె ... హే ... హే (నవ్వుతాడు.) బలేపెళ్లి... ఒహో ... హో ... (నవ్వుతాడు)

రామ:—అదేమిట్రా?

రంగ:- పెళ్లివద్దూ పెటాకులూవద్దు విడిచి తిరిగేదాన్ని వీధి లోనే వుంచమన్నారు. అయ్యా! లేచిపోయినదాన్ని పెళ్లిచేసుకుంటానికి నేనేమన్నా పరువులేని పసువను కున్నావా? గడ్డితినే గొడ్డుననుకున్నావా?

రామ:-ఒరేయి రంగనాథం.

రంగ:- అయ్యా!

రామ:-అదీ నిజమేరా నీకిష్టం లేకపోతే నాకెందుకొచ్చిందిరా యీా కష్టం.

రంగ:-అంతేనయ్యా.

రామ:-మనకు రావలసిన అప్పులాకొంని పోదాం.

రంగ;- ఆయనిచ్చినట్లే మనం తీసుకున్నట్లే.

రామ:-అన్యాయానికి తలపెట్టాడంటావా?

రంగ:- వాళ్ల అమ్మాయిని నేను చేసుకోపోతే అలానే చేస్తాడు.

రామ:-అదీ నిజమేరోయ్.

రంగ:-నేను చస్తే దాన్ని చేసుకోను.

రామ:-నువ్వు చేసుకోనూ వద్దూ చావనూవద్దు.

రంగ:-అలాఅయితే అప్పుసంగతి అడిగేద్దాం. అడగుదామన్నా నోరు పడిపోయిందిగా అమ్మాయి పరారుతో.

రామ:- ఉష్! ఉండరా ఎప్పుడూ వెధవగోల (కుటుంబరావు దగ్గరకు వెళతాడు) బావా! నా అప్పుసంగతి ఏమిటి? (కుటుంబరావుగారుకు మాటరాదు ఏదో సైగజేస్తాడు)

రంగ:-ఇంకెందుకు, సున్నా అనేస్తున్నాడు

రామ:- ఉండరా . . . బావా! ఆ ఎనిమిదివేలసంగతి (ఈ యిల్లు అమ్మివేయమన్నట్లు సైగ జేస్తాడు) యిల్లా!

(తలవూపుతాడు అవునన్నట్లు) అమ్మివేమనా? (అవున న్నట్లు తలవూపుతాడు)

రంగ:- యిల్లమ్మితే ఏం వస్తుంది నాబొంద. యిల్లూ ఆ కొబ్బరి తోటా రెండూ అమ్మితే.

రామ:-ఆయ నిలావుంటే కొంటాని కెవరొస్తారు.

రంగ:-మరేం చెయ్యాలి.

రామ:-మనపేరిట వ్రాయించుకోవాలి.

రంగ:- అలానే చేద్దాం.

రామ:-అందుకాయన ఒప్పుకుంటాడా? (కుటుంబరావు దగ్గరకు వెళ్లబోతాడు రంగడు ఆపి.)

రంగ:-ఆయన ఒప్పుకోటమేమిటి! ఆయన బాబొప్పుకుంటాడు. మనకు బాకీ, మన యిష్టం

రామ:-అదికాదురా ఆయనసంతకం చేయలేని స్థితిలోవున్నాడు

రంగ:- అలా అని కూర్చుంటే రేపో ఎల్లుండో చచ్చి వూరు కుంటాడు. అప్పుడు మన గతేమిటి?

రామ:-(ఆలోచిస్తూ రెండుసార్లు పచారుచేసి) ఆఁ ఒరేయి రంగనాథం! యిలారా (చెవిలో ఏదో చెప్పుతాడు)

రంగ:- బాగుందయ్యా చాలా బాగుంది.

రామ:-రెండు నిముషాల్లో వస్తా. (వెళ్తాడు రంగడు బీడి ముట్టించి సినిమాపాట రెండుముక్కలు పడ్తాడు. లచ్చి వస్తుంది.)

రంగ:- అమ్మగార్ని బొమ్మగార్ని చేసావే?

లచ్చి:-ఛీ! అవతలకునడు.

రంగ:- నడిచేరోజులు వస్తున్నాయిలే తొందరెందుకు.

లచ్చి:—ఈ దడిపింపులు చాలాచూసాం. (కుటుంబరావు దగ్గరకు వెళ్తుంది) బాబుగారు! . . . బాబుగారు అలాకళ్లనీళ్లు పెట్టకండి వచ్చేబండిలో శాంతమ్మగారు వస్తున్నారంట, డాక్టరుగారు చెప్పారు.

రంగ:— అయితే దొరికారన్నమాట దొంగలు.

లచ్చి:—దొంగలుకారు దొరలే.

రంగ:—ఆఁ దొరలేఁ! అదీ చూద్దాంలే.

లచ్చి: బాబుగారు! మీరలా కన్నీళ్లు కారిస్తే చిన్నబాబుగారు మరీచింతపడిపోతారు. డాక్టరుగారు మంచి మందుకోసం వెళ్లారు. అదివస్తే మామూలుగా లేచి తిరుగుతారంట

రంగ:— కాటిలోనే తిరిగేది కనపట్టంలా ఆకళ్ల వాలకం.

లచ్చి:—తిన్నింటివాసాలు లెక్కెట్టేరకం

రంగ:—ఆ . . . అదీ కనబడుద్దిలే తొందరెందుకూ. (బయటకు వెళ్తాడు)

లచ్చి:—బాబుగారు? . . . ఏంటి మీరనేది . . . రామూని తీసుకురమ్మంటారా . . , వద్దూ . . . నాకు తెలియటం లేదండి . . . ఏమీ వద్దు . . . సరేలెండి.

రాము:—(వస్తూనే) లచ్చీ నాన్న కెలావుంది. (కుటుంబరావు దగ్గరికివెళ్ళి) నాన్నా! (లచ్చితో) డాక్టరుగారేమన్నారు

లచ్చి:—మళ్లా నోరువస్తుందని మామూలుమనిషిగా తిరుగుతారని అన్నారు.

రాము:—ఎమిటో లచ్చి, నాకు పిచ్చెత్తినట్టుంది. అన్నయ్యా ఎలానూ లేడు. పోనీ అక్కాయి అయినావుంటే (ఏడుపు మొఖం పెట్తాడు.)

లచ్చి:-వూర్కో-బాబు . . . మాబాబుగా. అక్కాయి ఈబం డికే వస్తున్నారని డాక్టరుగారు చెప్పారు

రాము:-నిజంగానా?

లచ్చి:-అవునుబాబు

రాము:-అయితే యిప్పుడే స్టేషన్‌కుపోయి తీసుకొస్తా.

లచ్చి:-బాబుగారూ! (వినిపించుకోకుండా పారిపోతాడు. లచ్చి లోపలికి వెళ్తుంది. కుటుంబరావుగారు కదుల్తాడు మంచం దిగబోతాడు. కాని పడిపోతాడు. మూల నున్న టేబుల్ దగ్గరకు వెళ్లటానికి ప్రయత్నిస్తాడు. ప్రక్కనున్న మందుసీసాలు గ్లాసులు స్టూలు మీద నుంచి పడిపోతాయి. రంగడు, రామయ్య అడుగులో అడుగు వేసుకుంటూ వస్తారు. రామయ్య చేతిలో తెల్ల కాగితాలు ఏవో వుంటాయి. కుటుంబరావు లేకపోవటం చూసి ఆశ్చర్యపోతారు. ఒకరి మొఖాలు ఒకరుచూసు కుంటారు. క్రిందచూస్తే కుటుంబరావు కనపిస్తాడు. ఇద్దరూ కుటుంబరావును మంచంమీదకు జేరవేస్తారు.)

రంగ:-(నెమ్మదిగా) ఈ దెబ్బతో దెయ్యం దడుస్తుంది. అయ్యోయ్! అమ్మాయి ఎక్కడికెళ్లింది ఈ అయ్య గారికి తెలియదనా? అన్నీ తెలుసు, తెలిసి తెలిసే తెలివి తక్కువ దద్దమ్మైపోయాడు.

రామ:-ఏమిట్రా నీగోల. మనపని పూర్తికానియి. లచ్చి వస్తుం దేమో చూడు. (రంగడు లోపలికివెళ్తాడు.)

రామ:-బావా! అన్ని వివరాలు వ్రాయించాను. దీనిమీద సంతకం మాత్రం చెయ్యి. (పెన్ను అందిస్తాడు( చెయ్యలేవు...చూడు... ప్రయత్నంచెయ్యి అలా వది

లేస్తే ఎలా...కొంచెం ఓపికపట్టాలి...ఏమిటీ! అలా కోపంగా చూస్తావేం ... సంతకం చెయ్యవ్? ... (రంగడువస్తాడు)

రంగ:—అతగాడెందుకు చేస్తాడు, నే చెప్పలా సున్నా చుడ్తాడని

రామ:—సున్నా చుడ్తాడేం... అదీచూద్దాం ఊ... కానియ్ చాలా నిర్లక్ష్యంగావుందే... (అప్యాయంగా) బావా పిల్లోడ్ని గలవాడ్ని నన్ను అన్యాయం చేయకుబావా (తీవ్రంగా) మర్యాదకి మనిషివి కావల్లేవుందే ఇంకా బలవంతం చెయ్యాల్సివుంటుంది. త్వరగా కానియ్... చెయ్యవ్ (కోపంగా) రంగా...ఇలరా.

రంగ:— అయ్యా!

రామ:—ఇలారా ఈ వ్రేలికి సిరా ఎక్కించు. (అలాచెయ్య డానికి రంగడు వెళతాడు. కుటుంబరావు పెనుగులాడుతూ వుంటాడు. రామయ్య బలవంతంగా చెయ్య పట్టుకుం టాడు, లచ్చి వస్తుంది.)

లచ్చి:—ఏమయింది?...బాబుగార్కి ... ఏమిటీ మీరు చేసేది ఆకాగితాలేంటి? చేతికి సిరారాస్తున్నారెందుకు? ... (విడిపించటానికి ప్రయత్నిస్తుంది.)

రంగ;— అదంతా నీకెందుకు పోఅవతలకి.

లచ్చి:·వదలండి ... బాబుగారు! ...

రామ:—అరెయి దాన్ని అవతలకులాగేయ్. (రంగనాథం లచ్చి చేతులుపట్టుకుని లాగుతూవుంటాడు డాక్టరు వస్తాడు.)

డాక్ట;— రామయ్యగారూ! ఏమిటీ ద్రౌపదీవస్త్రాపహరణం.

రంగ;— నువ్వొచ్చావుగా కృష్ణుడికిమల్లె.

డాక్ట :-నోర్మ్యాయ్; ముందామెను విడిచిపెట్టు. ఏమిటితతంగం అంతా (రంగడు లచ్చిని పిడుస్తాడు)

రామ:- అబ్బే ఏమీలేదండీ. (కాగితాలు వెనక్కు దాస్తాడు డాక్టరు చూస్తాడు)

లచ్చి:-డాక్టరుగారు! బాబుగారి చేతికి సిరారాసారు

డాక్ట :— అదాసంగతి — రామయ్యగారూ! తమరు దయవుంచి రెండునిమిషాలు ఆగండి. కుటుంబరావు గార్కి యింజక్షన్ యిచ్చినతర్వాత వ్రాతకోతలు చూసుకోవచ్చు.

రంగ :-ఇంకా ఎందుకండి దండగ (డాక్టర్ కోపంగాచూస్తాడు)

రామ :-రంగనాథం! (కసురుతాడు డాక్టరు యింజక్షన్ ఇస్తాడు కుటుంబరావు స్పృహతప్పివుంటాడు)

డాక్ట:-కుటుంబరావుగార్కి స్పృహవచ్చిన తర్వాత సంతకం చెయ్యటానికే సిద్ధపడతారు. మీరు స్వయంగా శ్రమ పడనక్లేదు. (శాంత, భాస్కరం రామువస్తారు).

శాంత :-నాన్నా? నాన్నా! (దగ్గరకు వెళ్ళబోతుంది)

రామ :. ఏం ముఖంపెట్టుకొని వచ్చావే, నాన్న! నాన్నంట, ఏనాడైతే గడపదిగి వెళ్ళావో ఆనాడే నాన్నాకూతురు సంబంధం తెగిపోయింది, పో అవతలకి.

శాంత :-నాయింట్లో అడుగుపెట్టి నన్ను పొమ్మంటానికి నీ వెవరు? ముందు బయటకు నడు, కదలవేం?

రంగ :-ముందు మా అప్పు అక్కడబెట్టిఅను, అప్పుడు పోతాం

శాంత :-ఛీ! నీవూ ఒక మనిషివేనా! (కుటుంబరావు దగ్గరకు వెళ్తుంది) నాన్నా! ... నేనొచ్చాను ... చూడు నాన్నా, నాన్నా ... (ఏడుస్తుంది కుటుంబరావు

మెల్లగా కళ్ళు తెరుస్తాడు. మాట్లాడటానికి ప్రయత్ని
స్తాడు, కాని విపరీతంగా బాధపడిపోతాడు. ఆఖరికి
ఒక్కొక్క ముక్క బలవంతంగా వస్తుంది). శాం...తా!

శాంత :-నాన్నా ! ...

కుటుం :- అమ్మా ... ఎ...క్క...డి...కి...వెళ్ళావ్.

శాంత :- నాన్నా ... బాధపడకండి.

డాక్ట :-రామయ్యగారూ! వ్రాతకోతలు ఏమన్నా వుంటే ఇప్పుడు కానియ్యండి.

కుటుం :- డాక్టరుగారు !

డాక్ట :- మీరిప్పుడేమీ మాట్లాడకండి ప్రమాదం...కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. మానసికంగా తగిలిన గాయం వల్ల మాటపోయింది. ఇప్పుడు అన్ని పరిస్థితులు చక్కబడ్డాయి (రామయ్య దగ్గరకుపోయి కాగితాలు లాక్కొని చూస్తూ) అమ్మాయి ... మీకు ఆస్తంటూ చిల్లిగవ్వ కూడా లేదు. హాయిగా అడుక్కు తినేందుకు అవకాశాలు శ్రీ రామయ్యగారు కల్పించారు. ఇక అచరించడమే మీధర్మం.

శాంత :- డాక్టరుగారు !

డాక్ట:- చూడమ్మా ఇవిగో (కాగితాలు ఇస్తాడు) స్వ.తబావగారు చావు బ్రతుకుల్లో వుంటే స్వార్థంకోసం ఎన్ని అవస్థలు పడాలో అన్నీ పడ్డారు. కాని పాపం ప్రతిఫలం పొందలేక పోయారు. రామయ్యగారు మిమ్మల్ని చూస్తుంటే జాలివేస్తుందండి.

రామ :- మావిషయాల్లో మీరు అనవసరంగా కలుగజేసుకుంటున్నారు,

శాంత :— అవును, ఆయనకు అనవసరమే, అన్యాయంగా, అధర్మంగా ఆస్తినంతా అపహరించటానికి తలపెట్టిన నిన్ను మర్యాదగా మందలించి వదలిపెట్టడం అనవసరమే అయిపోయింది ఆపదలోనున్న ఆప్తబంధువుని ఆదరించక ఘోరప్రమాదానికి గురిచేసిన నిన్ను చెంపపెట్టు పెట్టకుండా విడిచి పెట్టడం నిజంగా అనవసరమే అయిపోయింది.

రామ :—నోర్మూయ్ ! పెద్ద చిన్నా లేకుండా మాట్లాడుతున్నావ్ ? డబ్బు ఇస్తే వచ్చే డాక్టరు చెంప పెట్టు పెట్టడము నీతి నియమాలు లేని నీవు మాకు నీతులు బోధించడము.

కుటుం :— బావా ? (కోపంతో వణికిపోతాడు)

శాంత :— నాన్నా ! (అని పట్టుకుంటుంది)

రామ :—ఏం ! నీకూ కోపం వచ్చిందా ! కులగోత్రాలను కూల ద్రోసిన ఈ కూలటను ...

కుటుం :-ఆగు. ఇంతవరకు సహించాను ఇక బయటకు నడవండి.

రామ :— అంతవరకూ వస్తే నాఅప్పుసంగతి తేల్చు.

కుటుం :— (బాధతో) అప్పా, నీ అప్పుకు ఆధారం ?

రామ :— అయితే అన్యాయానికి తయారయ్యావన్నమాట,

కుటుం :— (ఆయాసంతో రొప్పుచూ) అన్యాయం మీకిచ్చిన వాగ్దానంకోసం అభం శుభం ఎరుగని అమ్మాయికి ఆపదలు తెచ్చి అప్రతిష్టపాలుచెయ్యటం అన్యాయమే, మేనరికమని ముండల ముఠాకోరు, అజ్ఞానిఅయిన నీ కొడుకు గుణ గణాలు చూచికూడా సహించి అమ్మాయిని పెండ్లికి ప్రోత్సహించి, హింసించి ఏడ్పించింది

అన్యాయమే. నీవిచ్చిన అప్పుకోసం నాప్రాణాలు తీయటానికి సాహసించి నాబిడ్డలను నిరాధారులుగా చేయనున్న నిన్ను క్షమించి వదిలివెయ్యడం అన్యాయమే. అన్యాయానికి, అధర్మానికి ఎన్నడూ అలవాటు పడని నేను నీకిచ్చిన మాటకోసం అసమర్థుడనై నిజంగా అన్యాయానికే తయారయ్యాను, (విపరీతంగా దగ్గుతాడు శాంత సహాయంతో టేబుల్ దగ్గరకు వెళ్ళి దస్తావేజులు తీసి) యివిగో, తీసుకో, అన్ని వివరాలు ఇదివరకే వ్రాసి తయారుచేశాను. నాయింటిని నీపేర వ్రాశాను. దీనిఖరీదు పదివేలు వడ్డీతోసహా నీ బాకీ ముట్టినట్టే. తీసుకో (తీవ్రంగా దగ్గుతూ దస్తావేజులు మీదికి విసిరేస్తాడు) ఇంతటితో మన సంబంధ బాంధవ్యాలు తెగిపోయినట్టే (దగ్గుతూ) ఈ మైత్రీకం వంటు గల్పినట్టే (దగ్గుతాడు) (పోలీసు ఇనస్పెక్టరూ, ఇద్దరు పోలీసులూ, షావుకారుకి సుబ్బయ్యను, డ్రైవరు మణ్ణుగమునూ వెంటబెట్టుకొనివస్తారు).

ఇన :- కుటుంబరావుగారు ?

కుటుం :- ఆఁ! ... (ఆశ్చర్యంగా చూస్తారు)

ఇన :- (షావుకారును చూపుతూ) ఈయన మీకు తెలుసా ?

కుటుం ;- తెలుసు.

ఇన :- మీ కెలా తెలుసో చెప్తారా ? (కుటుంబరావు చెప్పిన ప్రతి అక్షరం నోటుబుక్కులో వ్రాస్తుంటాడు)

కుటుం :- ఒక్కవూరివాళ్ళం. చిన్నతనంనుంచి తెలుసు. ఒక స్కూల్లో చదివినవాళ్ళం. ఇంచుమించూ స్నేహితుల మనే చెప్పాలి. (దగ్గు)

ఇన :- స్నేహితులా ?

కుటుం :- అనే అనుకుంటున్నా.

ఇన :- తర్వాత ...

కుటుం :- తర్వాత ఒకే ప్రాంతంలో వ్యాపారాలు చేస్తుండే వాళ్ళం. కొంతకాలంక్రిందట వ్యాపారాల్లో పోటీ పడ్డాం. అతను లక్షాధికారయ్యాడు. నేను ... (విపరీతంగా దగ్గుతూ) ఇలా ఉన్నాను.

ఇన :- ఊఁ! ... అతను ఎప్పుడైనా మీయింటికివచ్చే అలవాటున్నదా ?

కుటుం :- లేదు ...

ఇన :- బాగా జ్ఞప్తికి తెచ్చుకోండి.

కుటుం :- (ఆలోచిస్తూ వుంటాడు. కొంత దీర్ఘాలోచనలో పడుతుంది)

ఇన :- పోనీ ... మీ ప్రకాశం బ్రతికుండగా ఎప్పుడైనా వచ్చాడా ?

కుటుం :- ఆఁ! ... ఒకే ఒక్కసారి ... వచ్చాడు. ...

ఇన :- వచ్చాడా ?

కుటుం :- అవును ... వచ్చాడు ... బాగాజ్ఞాపకంవుంది.

ఇన :- ఏంపనిమీద వచ్చాడో చెప్పగలరా ?

కుటుం :- వ్యాపారవిషయాలు మాట్లాడటానికి.

ఇన :- ఇంకా.

కుటుం :- ఇంకా ఏంచెప్పమంటారు. ఈయన లంచం యివ్వటానికి ప్రకాశంకొరకు వచ్చాడు. (దగ్గ)

కుటుం :- అవును ...

ఇన:- ఏయ్! ఒన్ నాట్ త్రీ. [ఇనస్పెక్టరు సైగతో ప్రక్కనున్న పోలీసు సుబ్బయ్య, షణ్ముగం చేతులకు సంకెళ్లు తగిలిస్తాడు] కుటుంబరావుగారు! మాకు కావల్సిన ఇన్ఫర్మేషన్ ఇదివరకే మానోటీసులోకొచ్చింది. మీస్టేట్మెంటు సరిగ్గా సరిపోయింది. మీప్రకాశం హత్యకు కారకుడు ఇతడే

సుబ్బ :- అబద్ధం. నేనలా రాలేదు. అలా రావలసిన అవసరం లేదు. స్నేహితుడవుగదాఅని నిన్ను పలకరించటానికి, వచ్చాను.

ఇన .- ఆగవయ్యా! నిన్నిప్పుడు ప్రశ్నించ లేదు.

కుటుం :- అలా లంచాలు పుచ్చుకుంటే నా ప్రకాశాని కాగతి పట్టేదికాదేమో ... (దగ్గు) తన ఆశయంకోసం లంచాల్ని తృణీకరించాడు. ఎన్నో త్యాగాలు చేశాడు చివరకు...నాప్రకాశం ... నా ... (అని ఏడుస్తాడు. విపరీతంగా గుండెపట్టుకొని బాధపడుతూ దగ్గుతాడు).

ఇన :- కుటుంబరావుగారు! లంచం యివ్వటానికే ఆనోజున వచ్చాడుకదూ.,

కుటుం:-[పెద్దషాక్ తగిలినవాడులాఅయిపోతాడు] ఆఁ [పెద్దగా దగ్గుతూ] అబ్బా.........స్నే...హి...తు...డ... వేమోనని మోసపోయాను. నీలాంటి అన్యాయవ్యాపారితో పోటీపడి నా ఆస్థంతా నాశనంచేసుకొన్నాను. నీ కివ్వవలసిన బాకీకి నన్ను వీధికెక్కించావ్ ... అప్ప

టికీ సహించాను. నిన్ను గురించి మనస్నేహితాన్ని నిలబెట్టమని లంచం పుచ్చుకొమ్మని కూడా నా ప్రకాశాన్ని అర్థించాను. ఇన్ని చేసినా సర్పంలాగా కాటువేశావ్, నా కుటుంబాన్ని, నా వంశరత్నాన్ని సర్వనాశనం చేసిన నీచుడవు. ఈ పాపానికి ప్రతిఫలం అనుభవించు (అని దగ్గుతూ రెండు చేతులతో సుబ్బయ్య కంఠాన్ని నొక్కటానికి ఒక్క ఉదుటున వెళ్ళబోయి ముందుకు తూలుతాడు. శాంతా, భాస్కరం కుటుంబరావును పట్టుకొంటారు. రాము నాన్నా ... నాన్నా ... అని గోలపెడతాడు. కొనవూపిరితో బాధపడుతూ భాస్కరం చేతిలో శాంతచేతిని పెట్టి ప్రాణం వదులుతాడు. శాంత "నాన్నా అని ఏడుస్తుంది. రామయ్యగారు కన్నీరు తుడుచుకుంటూ పైమీది కండువా కుటుంబరావుగారిమీద కప్పి శాంత తల నిమురుతాడు అందరూ విషాదంగా వుంటారు...)

తెర పడును

సమాప్తం